# కృతి సమర్పణము

శ్రీమద్వేంకటనామా !
క్షేమణి ! సాహిత్యలోక దినమణి ! కవిసు
త్రామా ! పండిత శేఖర
స్వామీ ! గురుదేవకొనుము సాష్టాంగనుతుల్ !

కవి కులంబునఁ బెద్దగామిమ్ముఁ బొగడనా
పండితుల్ గని కోపపడుదురేమొ,
పండితుండ వటంచుఁ బ్రస్తుతిసేయనా
విద్యావివేకముల్ వెలఁగుపడును,
విద్యాధికుఁడవంచు వేనోళ్ళఁ బొగడనా
విశ్వమానవత నన్వెక్కిరించు,
విశ్వమానవుఁడంచు వినుతిఁ గావింతునా
దైవచింతన వీపుతట్టి పలుకు,
గురువరేణ్యుఁడ ! శ్రీ దివాకరల వేంక
టావధాని ప్రముఖ ! మిమ్ము నే విధానఁ
బొగడ గలవాఁడ నేను మీ పుణ్యమున నె
నిలిచె నా కవిత్వము ధారుణీస్థలాన !

దేవుఁడు మనుజులఁ జేయును
తావక మాశీస్సు నరుల ధన్యులఁజేయున్
దీవించినారు నన్నల
కావున వెలయించినాడ కావ్యంబు నొకన్ !

కొండంతటి దేవునకుం
గొండంతటి పత్రినిచ్చుకోఁగలరె మహిన్
కొండంతటి గురుదేవా
నిండుమనముతోడ నిత్తునిక్కావ్యంబున్ !

పురుషాకారముఁదాల్చి వాణియలమా పుణ్యాన మీలోన ! సుం
దరమౌ కావ్యము సృష్టిచేయఁగల బోద్ధ్లేరు మీసాటి ! యీ
చిరుకబ్బంబును స్వీకరించి నను నాశీర్వాదముంజేసి సు
స్థిరుఁగాఁ జేయను వేడుచుంటిని కళాశ్రీ వెల్గు లోకంబునన్ !

యం. పి. జాను

శ్రీ

# ఆశీః

ఏదో పూర్వభవంపు సౌహృదము ప్రేరేపంగ సత్కావ్య మ
త్యౌదార్యంబున నాకు నంకితముగా నందిచ్చెమున్ ప్రీతి వి
ద్యాదేవీ కరుణా సుధాలసిత జిహ్వాగ్రుండు విజ్ఞాత మ
ర్యాదుండై తగు యం పి జానతనికే నాశీస్సు లర్పించెదన్.

రసభావంబులు, పాత్ర పోషణము, సారంబౌ కథావస్తు, విం
పెసలారన్ రచియించె జానుకవి సద్వేద్యంబ పల్నాటి వీ
రసమూహాద్భుత శౌర్యగాధ మృదువాగ్రమ్యత్వ మేపార దీ
ని సమర్పించెడి నాకెమత్సుకృతమున్ నేనెంత వర్ణించెదన్

యం. పీ. జాను కవిత్వము
సంపూర్ణ కళావిలాస సంపన్నంబై
యింపై వీనుల, కలముల
పెంపారు మరందబిందు వితతింజిమ్మున్

తెలుఁగు నుడికారమున యందు వెలయు పొలుపు
నందములు భావములు రసతుందిలములు
క్రమరీతిని వెలయింపఁగల నిపుణత
నరయవచ్చును జాను కావ్యంబులందె

కృతినాకు జానొసంగుట
కతిశయమగు ప్రీతి యొక కలుగు హేతువు; నే
ప్రతిఫల మొసంగఁజాలని
కతమున నాశిషమె కాన్కగా నర్పింతున్ !

హైదరాబాదు
23-3-78

(సం) దివాకర్ల వేంకటావధాని

యం పి జాను కవి శ్రేష్ఠం
సకుటుంబం సబాంధవం
యశోధనం సుఖం దత్వా
పాస్తు సర్వేదివౌకసః

# భూమిక

మాచర్ల సమీపమున మాదొక పల్లెటూరు. నేను వెల్దుర్తిలో **SSLC** చదువునప్పుడే పలనాటి చరిత్రయందాసక్తి మెండుగా నుండెడిది. తరువాత **TSLC** గుంటూరులో చదువు కాలమున మా జనకులు నాతో పాదచారులై మాచర్ల వరకు వచ్చి నన్ను సాగనంపెడివారు. పాదచారులమై వచ్చు మాకు మాచర్ల సమీపముననొక జీర్ణ దేవాలయమును, దాని ముందొక బావియు ప్రతి పర్యాయము స్వాగతము పలికెడివి. ఒకసారి వాటి వివరములు మా జనకుల నడిగితిని. అది బ్రహ్మనాయఁడు కట్టించిన గుడియనియు, ఆ బావియు నాయన త్రవ్వించినదేననియు వారికుండిన జ్ఞానముతో నాకు తెలిపినారు. ఆనాటి నుండి నాలో నేదియో చెప్పలేనియావేశము ప్రవేశించినది. ఒంటరిగా నా దారిని బోవునపుడా దేవాలయము చెంతఁగూర్చొని, ఈ రాలపై బ్రహ్మనాయుడు మొదలుగా గల మా పూర్వుల హస్త ముద్రికలెన్ని కలవోయనియు, నీ బావి నీరమెంత పురాతనమైనదోననియు చింతించుచు పులకరించి పోయెడివాడను. కాలచక్రగమనము నన్నుద్యోగమునొడ్డున చేర్చినది।

చిన్నతనము నుండియే నాకు కవిత్వము వ్రాయుట అలవడినది. అది పురాతనమైన యా బావినీటి ప్రభావమేమో। ఆ కవితాలతకు పాదులు కల్పించి, పందిరివైచిన పూజ్యులు మద్గురుదేవులు ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు. వారి దీవనల బలముతో, అమూల్యమైన కవివర్యుల కావ్యాధారములతో, పలనాటిలోని వయోవృద్ధులు తెలిపిన నిదర్శనములతో నీ వీరభారతమును విరచించితిని. దీనిని అస్మద్గురువరేణ్యులకే యంకితమిచ్చుట సహృదయులందరికి ఆనందదాయకమే కాక నా కావ్యకన్యకబ్బిన మహాభాగ్యముగా భావించుచున్నాను. ఈ నా యత్నమున నేమయిన పొరపాటులు దొరలినచో సహృదయులు తెలుప ప్రార్థన. వీలు కలిగిన మలి ముద్రణమున వాటిని సవరించుకొందును।

ఈ ముద్రణా యజ్ఞమున అమూల్యమైన సలహా నొసగిన పెద్దలకు, ఆర్థికముగా సాయపడిన మిత్రులకు, సకాలములో అందముగా అచ్చువేసి యిచ్చిన శ్రీ అన్నపూర్ణ ప్రింటింగ్ ప్రెస్ అధినేత శ్రీ ఎ. నరసింహారావుగారికి నా కృతజ్ఞతాభివందనాలు.

తెలుఁగువాఁడిగా పుట్టినందులకు నా కర్తవ్యమును నెరవేర్చినానను సంతృప్తితో, ఈ కావ్యము నాదరింతురను ప్రగాఢ విశ్వాసముతో, ఈ తెలుఁగువారి చరిత్రమును తెలుఁగువారికి సవినయముగా నందించుచున్నాను.

వందనములతో

గ్రంథకర్త

# విషయసూచిక

# వీరభారతము

## సమాలోచనము

వీరపల్లెనాటి పౌరుషారుణ రేఖ
పశ్చిమాశనెల్లఁ బ్రబలి వెలుఁగ
భరతమాత నుదుటి బంగారు బొట్టునాఁ
బశ్చిమాద్రిఁ దోఁచె భాస్కరుండు ! 1

రెక్కలల్లార్చుచు రివ్వున సాగి శ
    కుంత సంతానంబు గూళ్ళు చేర,
లేఁబచ్చికలు మేసి లేగలపై బుద్ధిఁ
    బార, నావుల మందలూరు చేర,
కోఁటేరు సరిదిద్ది కోఁడెల మళ్ళించి
    హాలికులెల్ల గృహాలు చేర,
పగలెల్ల పొలముల పనిపాట్లు కావించి
    శ్రమికులు తమ కుటీరములు చేర,
కఱ్ఱకొక వైపు తాఁబేటి కాయఁగట్టి
గోష్ఠమందల నడలించుకొనుచు నిల్లు
చేరుచుండిరి గొల్లలు ! చేడియలును
నీటిబిందెలతో సాగి రేటి నుండి ! 2

దినమణి యస్తమించె, నరుదెంచె నిశాపతి దిక్కులందు ప్రాం
చిన చిరుచీకటిం దొలఁగఁ జేయుచు వెన్నెల పాలు పోయుచున్
గణ గణ చెన్న కేశవుని గంటలు మ్రోగెను! చంద్రవంకలో
తొణఁకె జలంబు వెన్నెలల దోసిట చంద్రుని పల్కరించుచున్!
3

మానవతకు దివ్య మంటపంబది యంచు
సమత వాసముండు సదనమంచు
శాంతి నిలయమంచు, స్వర్గంబటంచు "మా
చర్ల" పురము కడు ప్రశంస నందె!
4

పలనాటికెల్ల నయ్యది
తలమానిక మౌచు రాజధానిగ నిలిచెన్
పలు తెగలవార లచ్చట
కలసి మెలసి జీవితంబు గడుపుచు నుండన్.
5

తేజము విస్తరిల్ల మలిదేవుని రాజుగఁ జేయఁ బూనెన
వ్యాజ కటాక్ష వీక్షణ ప్రభాకరుఁడై పలనాటి రాజ్యల
క్ష్మీ జయకారకుండు నుతశీలుఁడు బ్రహ్మనమంత్రి, ధర్మ దీ
క్షా జపతత్పరాత్ముఁడ యిత్స్త్రపతి కార్యము నిర్వహించుచున్
6

ప్రాసాదోపరి తలమున
నాసీనుండయ్యె బ్రహ్మనాయుండొక సిం
హాసన మందున! కన్నమ
దాసుం డరుదెంచి భక్తి తత్పరమతియై—
7

ప్రాంజలియౌచు మ్రొక్కరిలె! బ్రహ్మన వాని శిరంబు దువ్వుచున్
సంజనితప్రతాప భుజశక్తి విభూషణ! నీతిచంద్రికా
పుంజమ! కన్నమా శుభము! పూనిక నావచియించు నట్టి మా
టం జవదాటఁబోవు సుతుఁడా మన దెప్పటి బంధమో కదా!
8

అనుఁగు మహీ విభుండు ముగురాత్మజులంగని కన్నుమూసె వా
రిని, పలనాటి సీమను తరింపఁగ జేసెడి భారమంత యు
న్నను భరియింపు మంచు ! పలనాటికి నా నలగాము నెంతఁ బ్రే
మను మనురాజుఁ జేసితివి మంత్రిగనే గురజాల యందునన్ ! 9

ఆర్వెల్లి వారి కోడలు
గర్వాంచిత యూచువచ్చి కళగల రాజ్యం
బుర్వీశు మనసు విరిచెను
నిర్వేదము తోడనుండి నిలిచితి పుత్రా ! 10

ముక్కలు చేసె నాసికుల మాటను నీ పలనాటి రాజ్యమున్
టక్కరి నాగమాంబ ! యకటా ! నలగాముఁడు నామెయుచ్చులోఁ
జిక్కిన కేమి మాసెడినో, చేయునదేమి ? పవిత్రమైననా
చక్కని పల్లెనాడును, ప్రశాంతియు రెండుగ చీలి పోవగన్ ! 11

గత జల సేతు బంధనము గాఁగల కార్యము నిర్వహింపలే
దతులిత భాగ్యరాసులను నాకరమా పలనాటి సీమకున్
స్థిత గుణశీలుఁడైన మలిదేవుని రాజుఁగ జేసి, నేడు దుః
ఖిత మతినైతి నా ప్రజల కేవిధాన సముద్ధరించెదన్. 12

పయనం బెల్లి, వివాహ బంధమును పూర్వంబె బోవ గానెంచి, ని
శ్చయమున్ జేసితి వీరసోముని సుతన్ సౌభాగ్యరాశిన్, మహో
దయుఁడౌ నీ మలిదేవ భూపతికి నందంబైన దేవేరిగా
జయమా కార్యము చెన్న కేశవు కటాక్షంబున్నచో కన్నమా ! 13

ఆ "సీతాదేవి" మలిదేవునర్థి పూజ
చేసి వెలిఁగించు పలనాటి సీమ నెల్ల
వీరసోముని నడిగి యొప్పించు కొనుము
బోవలయు నెల్లి కల్యాణ పురికి పుత్ర ! 14

అని తన నిశ్చయంబు మహాత్ముఁడు బ్రహ్మన తెల్పుచుండ స
ద్గుణనిధి కొమ్మరాజు, తన కూరిమి పుత్రుఁడు నొక్క వైపునన్
దినమణి దీప్తితోడ మలిదేవుఁడు నింకొక వైపు వచ్చి బ్ర
హ్మనకు నమస్కరించిరి క్రమంబుగ కన్నమ లేచి నిల్వగన్ !

15

మలిదేవరాజును మాచర్ల గద్దెపై
నిలుపఁగావలెనంచుఁ దలఁచినాను,
కల్యాణపురి రాజు గారాల పుత్రితో
మలికి పెండిలి సేయఁ దలఁచినాను
కన్నమ వెంటరా కల్యాణ పురికేగి
వలయు మాటల నాడఁ దలఁచినాను
బావ కొమ్మన, ధర్మపరుఁడైన యలరాజు
యువరాజుతో నుండి యుచిత రీతి

సాయపడుచుండ, పెండిలి ఖాయపఱచి
మరలి వచ్చెద మాచర్ల పురికి నేను
కీర్తి వెలయించి (శ్రీ) చెన్న కేశవుండు
మనల చల్లఁగ కాపాడి మనుచుఁగాక !

16

అని బ్రహ్మన్న వచింప నెల్లరకు నత్యానందమయ్యెన్, శుభం
బును కాంక్షించి యొనర్చునట్టి కృషి మెప్పున్ గాంచు, ధర్మంబు నెం
చుచు కాపాడిన సద్యుదేసతము ముందు స్వస్కాలన్నిల్చి జీ
విసి కాపాడును, వారి నెల్లపుడు నీ విశ్వంబు కీర్తించెడిన్

17

బ్రహ్మ వ్రాసిన వ్రాత తప్పదు జగాన
బ్రహ్మనాయని మాటలు పల్లెనాటి
ప్రజలకెల్లను జవదాటరాని వేద
వాక్యములగుచు దలఁదాల్పఁ బడుచునుండు !

18

రాకా చంద్రుని రాక యీ జగము సర్వస్వంబు వెల్గించె శు
శ్లోకం బా పలనాటి గాథ నెపుడీ లోకంబు కీర్తింపఁగా
నాకాశంబున సాక్షిగా నిలిచి నాఁడా చంద్రుఁడున్నట్లు తా
నే కారుణ్యము చేత నిల్పునొ గదా యీ వెల్గులుర్వీ స్థలిన్ !

19

మలిదేవుని మోమున వె
న్నెల పూవులు విరియు నొక్క నిర్మల హాసం
బలమికొనియె ! వాని గనుచు
నలరాజును మురియు, కొమ్మనాయుఁడు మురియున్ !

20

కన్నమదాసు మేన పులకల్ పొడసూపెను ! ఆననంబునన్
సన్నని నవ్వు మిక్కిలి ప్రశాంతతఁ జిల్కెను ! మానసంబునం
దెన్నొ మహానుభూతులు జనించెను ! బ్రహ్మన పాద పద్మముల్
కన్నుల కద్దుకొంచుఁ బలుకం దొడఁగెన్ కనురెప్పలార్చుచున్

21

చాపకూటి తోడ సమతను సృష్టించి
మానవతకు పాదు మలఁచినావు
నిన్నుఁ బ్రస్తుతించు నిఖిల లోకంబె పృ
తండ్రి వీవ ! నాకు తల్లి వీవ !

22

రక్షింపవే ! యంటరాని యభాగ్యులు
　　మనుజులే యంచు సమతనుఁ జూపి,
శిక్షింపవే ! స్వార్థజీవుల యెదలందు
　　నన లెత్తు పేరాశ యను పిశాచి,
కల్పింపవే ! నిత్యకల్యాణములు, పచ్చ
　　తోరణాల్ శాంతి వధూటికిచట,
కాపాడవే ! ప్రజన్ కన్నబిడ్డల రీతి
　　వలసిన సౌకర్యములనుఁ గూర్చి,

2)

దీన జన బంధు! నీ శాంతి దీక్షలోన
పల్లనాడున కక్షల శుభంబుఁ గల్గె
నట్టి నవతారమెత్తిన మానవతవో
కాముని స్మృతి శాంతి దేవతవో తండ్రి! 23

కలుము మహా ప్రాచి తన కోరలు సాచి యభాగ్య జీవులన్
బిలిచిన గొప్ప దీపములు కాంచఁగ రాకని మాద్రుష్టి చే, చిం
తలను మునిగి స్వీయ గనండపయించిన వారి యశ్రు ధా
రలు కడుతో తనానిలిచి బ్రహ్మను మించిన కన్న తండ్రివై. 24

అంటరాని వారలకు దేవాలయ ప్ర
వేశ మొసఁగిన నీ దయావీక్షణముల
చక్కనైన కల్ప వృక్షములు తండ్రి
ఫలము లందించు పలనాటి పొలము లింక. 25

అనెడి కన్నమదాసుని కనుల నిండ
పొంగ బాష్ప జలంబులు మునుకకొని యె
వాని వదనంబుఁ గనుచున్న బ్రహ్మనయును
పలుకు పలుకఁడు తన చూపు మలుపలేడు. 26

వారి యనుబంధమును కన్నవారలెల్ల
నిలిచి, నిశ్చేష్టులగుచును పలుకలేరు
తండ్రి కొడుకుల దివ్య బంధమును దెలుప
మాటలున్నవె? కనుఁగొను మనసు దక్క! 27

మలిదేవ్రుడు విహారి భావ విలసన్మాధుర్య కంఠాన, మీ
కలు దివ్యా దయనుంగు భూపతి సుతుల్ సద్ధర్మ సంపన్నులై
నిలువం బోలురు భూమిపై నిలమి తండ్రీ! నీ దయాభిక్ష చే
పలనాటి దేశము నైతికపథ్యల సుసంపన్నంబుగా మారెడిన్! 28

జనకుఁడు ప్రశ్నించె, నను జన్ములు దూరము చేసినాఁడు, పి
న్నను నను బెద్దఁజేసి, సుగుణంబులు నేర్పి, పల్నాటిగ
ద్దెను నొకరాణిగా నిలుప దీక్ష వహించి, క్రమించు నిన్న నే
మని వినిపింతు నంచు, తడిమారని కన్నులఁ జూచె బ్రహ్మనన్ !
29

అలరాజు గురువు గారికి
పులకిత గాత్రాన పాదపూజ లొనర్చెన్
పలనాటి భాగ్యరాశిని
లలిత మధురమూర్తి కొమ్మరాజు నుతించెన్ !
30

అందరి మాటలన్వినుచు, నందరి మోములు తేరి చూచుచున్
వందిత భవ్య శీలుఁడగు బ్రహ్మన తానిటుఁబల్కె, నాదు దై
సందిన జీవితంబును ఘనంబుగ నెంచుట పాడియౌనె ? మీ
యండయు లేక నాదు సమతాశయ మెట్టుల రూపుఁదాల్చెడిన్ !
31

కలుగునే ? యొకరినొక్కరి నిట్లు పొగడుట
వలన సౌభాగ్య మీ పల్లెనాట !
కలుగునే ? వట్టిమాటలు చేత సుస్థిర
రక్షణ పలనాటి రాజ్య రమకు
కలుగునే ? యిట్టి చేతలులేని వ
శాంతి దేవత దయా
కలుగునే ? నన్ను నింతలు
కాఁగల కల్యాణ క

అనుఁగు భూమిని కనుమ క
నిదుమిత్రుఁ కేసి నన్ను మ
నాదు కర్తవ్యమగు పలనా
రాజు సంకల్ప నెట్టులైన ఱా

ఇంత మాత్రాన నన్ను నే మేమొ యనుచు
బహు విధంబులఁ బొగడుట పాడికాదు
వెతల వల దేవు కల్యాణ విభుని కడకు
నేను విశ్రమింపుఁడు మహనీయులార !

౨౩

జనకుని మాటలు విని త
క్షణమే జరిగించు పూన్కి సాగెడి సుతులన్
మనసున కెత్తుచు వారలు
చనిరంతఃపురికి మిగుల సంతోషమునన్ !

౨౪

# స త్ప థ ము

అది కల్యాణ పురంబు! శైవులకు గేహంబున్, ధనంబాది సం
పదకున్ సౌధము! రాజనీతికి లసన్మాణిక్య మంజూషయున్
పదిలంబైన ప్రశాంతి కిన్నెలవు! సర్వ ప్రాణి సంక్షేమమున్
మది జీర్ణించిన వీరసోమునకు సామ్రాజ్యంబు నిద్ధారుణిన్ 1

తమ్ముఁడు వీరసోముని పక్షంబుల నిచ్చెడివాఁడు, వీరశై
వమ్మున కంకితంబయినవాఁడు, పరాక్రమశాలి, ధర్మ సూ
త్రమ్ము నెఱింగి నట్టి పరతత్త్వ విదుండును, రాజుగారి శౌ
ర్యమ్మున కాల వాలమయి రాజిలు చుండును నందిసోముఁడున్ 2

నందిసోము పుత్రి నాగులాదేవియు
వీరసోము పుత్రి వినుతశీల
యా "సిరాకుమారి" యంతఃపురమునకు
కళలు సంతరించి వెలుఁగు చుండ్రు. 3

యౌవన ప్రాంగణమ్మున విహారము సల్పుచునున్నవారు శ్రీ
దేవి, సరస్వతీ సతియు తేజము నన్విడిపోని జంటగా
నా వసుధేశు పుత్రికల హర్నిశమున్ కలహంస యానలై
జీవితమింక వారి నెటుఁ జేర్చునొ? యే విధి నిర్ణయించునో? 4

అన్నదమ్ముల బిడ్డలన్న మాటయె గాని
యొక తల్లి బిడ్డ లట్లుండ్రు వారు
తనువులు రెండౌచు కనిపించునే కాని
హావ భావములొక్క టై రమింత్రు

మాటలు రెండన్న మాటయే కాని, భా
వార్థ మొక్కటి యౌచు నలరు చుంద్రు
మనసులు రెండని యనుకొంటయే కాని
నిశ్చయ మొక్కటై నెగడు చుంద్రు
ఒక్క చోటఁగుడిచి, యొకచోట నాడుచు
నొక్కటిగను బ్రదుకు చుండివారు
పరిణయంబు కాఁగ, భర్త కొంగును పట్టి
పోవునప్పుడు విడి పోవఁగలరె ? 5

వీరసోమ విభుని పేరోలగంబున
బ్రహ్మనాయఁడుండె భద్ర పీఠి
కన్నముందు నితర కార్యకర్తలు నుచి
తాసనంబు లందు నలరుచుండ ! 6

అంత కల్యాణపురి విభుండనియె నిట్లు
బ్రహ్మనార్య ! మీ రాకచేఁ బావనంబు
మాదు రాజ్యంబు మా సభా మంటపంబు
ధన్యులైతిమి మీదు సందర్శనమున 7

సమతా వాదమె వేదమై చెలఁగునీ సత్యవ్రతం బెప్పుడు
త్తమమైనట్టి ఫలంబు నిచ్చును మహోదారుండ ! నీ కీర్తి ని
త్యము కీర్తింతురు ధారుణీ ప్రజలు ! శౌర్యంబుండి నీయట్లు శాం
తము నాశించెడి వారు లేరిలను భద్రం బౌను నీకెప్పుడున్. 8

ఊరక రారు మీరు, భవదుజ్జ్వల నూత్న మహోద్యమంబులోఁ
జేరుమటంచుఁ దెల్పుటకొ, చీటికి మాటికి కత్తి దూయుచున్
బోరికిఁబన్న్వలై త్తియుఁకఁ బోవకుఁడంచును హెచ్చరింపనో
అరయలేము మేము భవదాగమనంబునకేమి హేతువో ! క 9

నరపతి మాటల కలుచుచు
దరహాసము చిందులాడ తానిటులనియెన్
సురుచిర మధురోక్తుల సు
స్థిర మతి బ్రహ్మన్న. సభను దీప్తి చెలంగన్ !

10

మీ సోదరంబు మమ్ముల
నే యులరించినది దాపనేల మహీశా
నీ యనుఁగుఁ బుత్రినీయుము
మా యువరాజునకుఁ బేర్మి మలిదేవునకున్.

11

పలనాటి రాజ్యలక్ష్మి యె
వలచిన మలిదేవ విభుని భార్యగనీ ము
ద్దుల కూఁతునీయఁదగు, పెం
డిలియగు కల్యాణ ధారుణీపతి వింటే ?

12

కల్యాణ విభుఁడవీవయి
కల్యాణము జరుప శుభముకాదె, ధరణికిన్
కల్యాణమగాను ! శాంతికి
కల్యాణంబౌను ! నాదు కాంక్షయుఁదీరున్.

13

ఆతఁడు రూప సంపదలయందున మన్మథుఁడై విరాజిలు
న్నీతికి, రాజనీతికి, వినిర్మల ప్రేమకు, ధర్మ దీక్షకున్
ఖ్యాతి వహించినట్టి మహాత్ముఁడు ! నీకిలనల్లుఁడైన ప్ర
ఖ్యాతియుఁ గల్గునీకు, ప్రియమారఁగనా పలుకాదరింపుమా !

14

విరజాజి మావులయు, స
త్స్వరుష ప్రకృతి లలనలయు పొందువలెనవే
యరమరిక లేని బంధము
చిరజీవులకీ వెకలుగఁ జేయుము రజా !

15

నిజమగు బంధుత్వంబున
సుజనులు హర్షింత్రు వీరసోమ విభూ ! యె
ల్లజనులు హర్షింతురు ది
గ్విజ యోత్సాహమునఁ బెండ్లి విందులు సేయన్

16

కల్యాణ కాంక్షచే నీ
కల్యాణ పురాన నేను కాల్మోపితి, సౌ
శీల్యవతి సిరాదేవిని
కల్యాణ గుణుండు మలికికాన్కఁగ నడుగన్ !

17

అనవిని మంత్ర ముగ్ధమయినట్టి భుజంగము భంగిపల్కఁడా
జనపతి వీరసోముఁడు, ప్రచండ క్రుధాగ్నులు మండుచుండె నా
తని మనమందు, తెల్పుటకు ధైర్యము చాలద యెట్టకేలకున్
తన పరివారముంగని వ్యథందిగ మ్రింగుచు నాతఁడిట్లనున్

18

కలుగునే వైష్ణవులకు శైవులకుఁ బెండ్లి
కిచ్చి పుచ్చుకొనుట యెప్పుడీ జగాన ?
నీమనుద్యమ మన్న మన్నింతుగాని
మతము మారిన విష్యము మాకువలదు.

19

ధనము లేకున్న జీవనము సేయఁగవచ్చు
    మతము మారిన నెట్లు బ్రతుకఁగలము ?
రాజ్యంబు లేకున్న బ్రతుకవచ్చునుగాని
    మతము మారిన నెట్లు బ్రతుకఁగలము ?
పౌరుషహీనత బ్రతుకవచ్చునుగాని
    మతము మారిన నెట్లు బ్రతుకఁగలము ?
మడిమాన్యములు లేక మనఁగవచ్చునుగాని
    మతము మారిన నెట్లు బ్రతుకఁగలము ?

వీర శైవులు మతిమాలి వీర వైష్ణ
వులకుఁ బుత్రిక నిచ్చినవిలను ప్రజలు
నవ్వి పోవరెమో పలనాటి నాథ
ఈశ్వరుఁడు మెచ్చునే మమ్ము నిట్టి పనుల ?

20

కాని కోర్కులు నిల్లను గంగనేల
మాకు సమ్మతమైనవి, మీకు వలసి
నవియుఁ కోరిన మిగుల వినయము తోడ
నర్పణము సేతునో బ్రహ్మనార్య వినుమ !

21

అనిన, నాజ్యంబుపోయ నుప్పొనను లేచు
నగ్ని శిఖవోలె మండు క్రోధారుణంబు
నేత్ర యుగళిని నిలిచి మండించుచుండ
కన్నముఁడు లేచి గర్జించి, కత్తిదూసె.

23

కులహీనుఁడవై బ్రహ్మన
పలికిన పల్కులకు వంత పాడెను నీకే
తెలిపోగర లేల కన్నమ ?
తెంపవు నియమంబు లవిమొఘరాశీ పతియున్.

23

అంత కన్నమదాసుని ననునయించి
బ్రహ్మనాయుఁడు నిలిచి పలుక సాగె
కోప ఘూర్ణిత ముఖుఁడైని నగాక ఘరిత
జలద గంభీరమైన సుస్వరము తోడ.

24

కులము మతంబటంచెప్పుడు కోడిగ కూసిన లాభమేమి ? మా
కులమును నద్దు గోపలిల కూలడె కాలము చేసువయ్యె ! దీ
నులను, నభాగ్యజీవులను నోటికి కన్నము వైచియూరి కా
వల నివసింపఁజేయను వారలు పాపలు కాకపోదురే ?

 25

పలు విధంబైన వంటలనిచ్చి జీవుల
నిలుపు నీ భూదేవి కులమదేమి ?
గుండెలో జలధార కుండపోతగ పోయు
జలధరమూర్తిదే కులము తలప ?
ప్రాణులకెల్లను ప్రాణప్రదంబగు
మలయ మారుతము దేకులము తలప ?
తన శక్తిని జగంబున కిచ్చి వెలిగింప
గల ప్రభాకరునిదే కులము తలప ?

పిండి వెన్నెలనిచ్చు జాబిల్లి కులము
కాంతి వెదజల్లు గ్రహతారకముల కులము
తెలిసికొనలేము, నవ్వియు తలపబోవు
మానవుల కేలకులమన్న ప్రాణమయ్యె ?

26

అర్థించి వచ్చెదవు కా
ర్యార్థము నరవేర్ప బ్రహ్మనాయని నీవే
వ్యర్థంబు కాదునా వా
క్యార్థము ! కల్యాణపురి మహోవిభవింటే ?

27

అని యుద్యోగంబున బ్ర
హ్మన పల్కెగ ననుగు సుతుడు నా కన్నమ లే
చినడువ, నినువృప కోపం
బున మాచర్లకును మరలిపోయిరి వేగన్ !

28

పరమ శత్రువులను బంధువులుగ జేయు
బంధుకోటిని పగవారి జేయు
కాలగర్భ మందుగల జాతకంబును
తెలియు మానవుండు నిలను గలడె ?

29

చిత్తమునిల్పి బావ శివసింగుని పైననె నాగులాంబయున్
నెత్తలిరాకు జొంపముల, నిర్మలహాస సెలయేళ్ళ పొంత, పూ
గుత్తుల కమ్మతావులను కోరికమై విహరించు చుండి క్రొం
గ్రొత్త విలాస శోభలనుఁ గాంచుచు నుండిరివారు సృష్టికిన్ ! 30

అది విని నందిసోము హృదయంబున కోప విషాగ్ని గుప్పు మ
న్నది ! శివసింగునుం బిలిచి నాగుల నాదగు ముద్దుబిడ్డ, నె
మ్మదినిటు దొంగిలించితివి, మాకును మీకును విష్యమన్నదే
కుదురదుచిత్త యత్నముల కుందిగ కంమును హెచ్చరించినన్ ! 31

శివసింగు, నాగులాసతి
యువకులు ! ప్రచ్ఛన్నులౌచును క్షితిని నొకట్టై
శివనంద్ల కోటఁ జేరిరి
యవిచారితవారుఁ బెండ్లి యాడిరి యచటన్. 32

మనసులు కలసిన జంటలు
ధనమును, ప్రాణమును లెక్కఁదలఁపవుగద ! ప్రే
మను నమ్మి బ్రదుకు జంటల
మనుఁగడ లేమాయె ? ప్రేమ మాత్రమె మిగిలెన్ ! 33

అత్త కుమారుఁడంచు ప్రియమారఁగఁ బెంచఁగ మామ పుత్రినే
యెత్తుక పోయినావు భళిరే ? భువిపై నిఁక నిన్ను నిల్పఁగా
నిత్తుమెయంచు కోపకుటిలేక్షణులై తొడగొట్టి వేగ డం
డెత్తిరి సోమ సోదర మహేశ్వరులున్ శివతాండవంబునన్. 34

సంకుల సమరంబున నిరు
వంకల వీరులును పట్టువదలక పోరన్
శంక జనించెను పటు శౌ
ర్యాంక కుండగు వీరసోము నంతరమందున్. 35

కోరి సమరాంగణంబునఁ బోరుసల్పి
విజయమును బొంద లేకుండె వీరసోముఁ
డంత నందిసోముఁడు తన యన్నతోడఁ
బలికె నీ రీతి విజయ సంప్రాప్తి కొఱకు.

36

బలవంతుండును సత్యసంధుఁడునునా బ్రహ్మన్న నాయాన కో
ర్కెలు సిద్ధించును, పంపు దూతలను, మాకున్ మా సిరాజేనితో
తుల లేనట్టి నిరాత్మ సంపదల నిత్యోన్నత సైన్యంబుతో
బ్రళయంబున్ దగ సృష్టి చేయుటకు మా పంతానఁ బోరాడుమా—

37

కోట పటిష్ఠమైన నెనువెంట కీర్తి ప్రశస్తి
నతుల సంపదతోడ మాకు క్షణంబు
సేతునని రాయబారంబు సేయుమయ్య
విజయలక్ష్మి వరించి దిగ్విజయము నొసఁగు !

38

అభిమానం బెటులున్నగాని మన ప్రత్యర్థిన్ జయించున్, మహా
శుభ సౌభాగ్యోన్నతి ముట్టిపట్టి కొనఁబోనొప్పున్, స్వీయ రాజ్యాశ్రిత శ
త్రు భయంబున్ మటుమాయమై చనును ! ప్రియంబైన బ్రహ్మన్న దు
ర్లభ సాంగత్యము కూడె రాయవిజయారంభంబు ముమ్మాటికిన్.

39

అని విన్నవించు తన త
మ్ముని మాటలలోని సత్యమును గనియుక్తిన్
పనిచెను దూతల భూపతి
యనిలో న్యాయంబు బ్రహ్మనాయని వేడన్ !

40

కులము మతంబటంచు పెనకూఁతలు గూసి తృణీకరించి, ప్రే
మిలసిల్లు బ్రహ్మనాయు నవివేకముగా నిరసించినట్టి చం
చలమతి సోమభూమిపతి, న్యాయము కోరెను బ్రహ్మనాయునే
తలఁపఁగ గర్వరేఖ నతిరంబున నర్థముఁగాన్చు నక్కటా !

41

వినియెన్ బ్రహ్మన వర్తమానము, మహావీరుండు సోముండు పం
పిన యాహ్వానము, శైవ సోదరమతావేశోప సంహారమున్
అనుగుం భూపతి పుత్ర రత్నమున కత్యానంద సందోహమున్
మణి మాణిక్య చిరత్న శోభిత "సిర" మాధుర్య భావార్థమున్ ! 42

ఔరా ! యెంతటి సిగ్గుమాలిన హృదాయాసంబు ప్రాప్తించె ? నీ
వీరోత్సాహము, సచ్ఛనీచకుల సంవేద్యంబు, శైవంబు, నా
హా ! రాజ్యస్థితిత్వ గర్వమిపుడే మాయెన్ ? ఛీఛీ ! దేలసై
పోరంజాలెడి శక్తి లేకిటులు మమ్మున్ నాలుమర్థింతువే ? 43

అని కల్యాణ ప్రదీశ నిందెగను రోషావేశుడై కన్నముం
దన హస్తంబున బ్రహ్మనాయుడదిమెన్,— ధర్మోపదేశాలు నీ
కును విన్పింతును కన్నమా ? యనెను ! వాక్కుల్ రాక నిల్చుండె నా
యనుగుం బుత్రుడు తండ్రి చెంత నటులే హస్తంబులన్మోడ్చుచున్. 44

చేతుము యుద్ధమింక, పాడిసేతుము శత్రులమూక లెల్ల, కై
సేతుము వీరసోమునకు శ్రీకరమౌ విజయోన్నతత్వమున్
సేతురటంచు నమ్మెదము చెప్పిన మాటలనెల్ల సేతగా
నీతికి నిల్పు మంచు తన నిర్ణయమంపెను బ్రహ్మనాయుడున్. 45

తమ దైవంబగు చెన్నకేశవుని శ్రద్ధంబూజ గావించి క
న్నమదాసుండును, వీర సైనికులు వెంటన్నడ్వ, బ్రహ్మన్న సాం
తము గంభీర మహోత్సవానరిపు సేనం గూల్పంగా నాగ, సం
ద్రములున్ ఘూర్ణిలి మింటిచాయగనె రౌద్రంబౌత రంగంబులన్. 46

బ్రహ్మనాయుని సేనలు పయ్యలెత్తి
పడెను శివసంస్థ కోటపై ! వారవీరు
విజయలక్ష్మిని బొంద నావేశమూని
సంగరం బొనరింపంగ సాగినారు. 47

హయహేష, వీర విజయఘోష యొక్కటై
ఆకాశమును ముద్దులాడెనొకట !
రథ చక్రములును, గుఱ్ఱములు లేపెడి ధూళి
యుప్పరంబును కప్పెనొక్కచోట !
పదును కత్తుల కాంతి బల్లెంపు తళతళల్
చిరుచీకటిని మాపు చేసెనొకట !
కరములు, మకుటాల శిరములు కుప్పలై
యుర్విఁబొర్లుచు నుండె నొక్కచోట !

పక్షులల్లు రాలిపడుచున్న వీరుల
రక్తసిక్త దేహ రాసులొకట
కత్తులేసు లొకట ! కత్తిదూయక ముందె
ప్రాణహాతినిఁ గూలు బంటులొకట !

48

పోరతి ఘోరంబయ్యెను
వీరుఁడు శివసింగు సేన వికలంబయ్యెన్
నీరస నిస్పృహాలో దవఁగ
పోరు విడిచి సింగు నంతిపురముం జేరెన్.

49

లావణ్యవతి నాగులాసతి, శివసింగు
నొక్క పీఠికనుఁ గూర్చుండినారు,
బిగికౌఁగిలింతలు, నగుమోముకాంతులు
విడిపోక మిగుల శోభిల్లినారు,
కన్నుల జంటయు, కరముల జంటయు
కలిపి ప్రేమకుఁ బూజసలిపినారు,
ఈజన్మకే కాదికెన్ని జన్మలకైన
విడిపోమటంచుఁ జెప్పికొనినారు,

పచ్చి విషమున ప్రేమభావమును కలిపి
పుచ్చుకొన్నార లిరువురి, ప్పుడమిపైనిఁ
బ్రేమ నిలువలేదని చెప్పురీతి కనులు
మూసిజంటగా భువినెడబాసినారు !

50

ఎవరు సుఖమునుబొంది జీవించినారు
నిర్మలప్రేమ జంటలీ నేలపైని ?
దేశదేశాల చరితలు తిరుగవేయు
నట్టి జంటల మరణంబు లెన్నగలవా ?

51

కోట పట్టువడెను ! కోటలోఁబడియున్న
జంటగాథ కనుచు కంటనీరు
పెట్టుకొనని యొక్క వీరుండు కనరాడు
బ్రదికియున్న ప్రేమ పలుచనగును !

52

కంటనీరు పెట్టి కటకట పడినను
మరణమైనవారు తిరిగిరారు
మడిసినట్టివారు మహనీయులై వెల్గ
బ్రదుకువారు చట్టుబండలైరి !

53



# కల్యాణము

ఆలమునఁ బుత్రిఁ గోల్పోయినట్టివారు
మాట విలువను మాత్రము మఱవలేదు
శిథిలతంత్రులతో సితారఁజేవి బ్రదుకు
సుఖమయముఁ జేయఁగాఁ బూనె సోమవిభుఁడు !

1

మాచర్ల యువరాజు మలిదేవునకు, సిరా-
దేవికిఁ బెండ్లి నిర్దేశమయ్యె,
పట్టాభిషేక వైభవమహోత్సవమున
కన్ని యేర్పాట్లుసేయంగఁబడియె,
మాచర్ల పురికీర్తి మణిదీపికలు దిక్కు-
దిక్కునకెగఁబ్రాకి తేజమొసఁగె,
పలనాటివీరుల పౌరుషప్రభ వైరి
గుండెగాలంపాము గ్రుచ్చుకొనియె,
నగరవీథులకును తోరణాలు గట్టి
పురమునంతెల్ల ముత్యాల ముగ్గువేసి
పెండ్లి వేడుకతోడ శోభిల్లి రంగుల
నుల్లసిల్లి నదానాడు పల్లెనాడు.

2

బ్రహ్మనాయుండు శుభంబును వాంఛించి
చెన్నకేశవుఁ బూజసేయుచుండ,
కన్నమదాసుండు కార్యభారములెల్ల
తనభుజంబున వేసికొని చెలంగ,
కొమ్మరాజును తన కూరిమి యల్లుని
పెండ్లి కార్యములెల్ల ప్రీతి సలుప,
అలరాజు తన బావ మలిదేవరాజుతో
సరస సల్లాపముల్ సలుపుచుండ,

బాలుఁడగు బాలచంద్రుని కేలు వట్టి
తల్లి ఐతాంబ మిగుల మోదమున నుండ
చెల్లమాంబ ముత్తైదువుల్ చేరి వెలుఁగ
శ్రీలు పొంగెను పలనాటి సీమలోన ! 3

తన మిత్రరాజులకు బ్ర
హ్మన పంపెను పెండ్లి వర్తమానము, గురజా
లను నేలుచున్న నలగా
మునకును కబురంపె వేగముగ రమ్మనుచున్ ! 4

వచ్చి చేరెను మండాది బలగ మెల్ల
మాచర్లాపురి మిత్రులు మహితయశులు
గుత్తికొండ వారలు సమాయత్తమగుచు
నలరి మలిదేవునకు కానుకల నొసంగ ! 5

మలిదేవునకు వేగ మంగళ స్నానంబుఁ
గావించినది యొక్క కలికిమిన్న,
మంచి గంధము పూసి మానిని యొక్కర్తె
రత్నహారములు భూరమణునకిడె,
పీతాంబరాల్ గట్టఁబెట్టిన దొకలేమ
మలిదేవభూపతి మన్మథునకు,
తిలకమిడె నిటల ఫలకాన నొకయింతి
తేజమొప్పఁగ మలిదేవపతికి

బుగ్గపైని పెళ్ళిబొట్టును సవరించి
బాసికంబు గట్టె పడఁతి యొకతె
కంకణంబుఁ గట్టె కల్యాణ శోభలు
వెలయఁజేసె నొక్క వినుతశీల ! 6

నూగుమీసాలతోడ, వినూత్నమైన
యౌవనపు శోభతోడ, కల్యాణశోభ
తోడ, నవ మన్మథుని రీతిఁ దోఁచుచుండె
దీప్తి రంజిల్లఁగా మలిదేవరాజు !

7

వచ్చిరి సోము సోదరులు వాద్య రవంబులు మిన్నులంటగాఁ
దెచ్చిరి రూపశీల మణిదీప్తుల వెల్గు సిరాకుమారినిం
బచ్చని తోరణాల నిరువంకలఁ గట్టిన రాచబాటలన్
నెచ్చెలి మోముఁగాంచి తరుణీమణులెల్లను సంతసింపఁగన్.

8

అంత నైతాంబ దృష్టి తీయంగఁ బెండ్లి
వారు నత్యంత సంతోషభరితులగుచు
నగరు సొచ్చిరి ! (శ్రీ) పలనాటిసీమ
తెలుఁగుతల్లికి హారమై తేజరిల్ల

9

కన్యకా రత్నమునకు శృంగారవతులు
శిరసు మజ్జన మొనరించి, శ్రేష్ఠమైన
తిలకమును కస్తురిని తగఁదీర్చి రత్న
మయ విభూషలఁ గై చేసిరయము మీర—

10

కల్యాణ వేదినుంచిరి
కల్యాణపురీశు సోము గారాల సుతన్
కల్యాణ గుణునితో, నై
ర్మల్య సదాచారవర్తి మలిదేవునితో !

11

బంగరు కాంతుల యందున
మంగళ వాద్యముల ఘోష మార్మ్రోఁగఁగా
శృంగారవతి సిరాకును
మంగళ సూత్రంబుఁ గట్టె మలిదేవుండున్.

12

అంతట బంధుమిత్రులు జయంబు శుభంబునుఁ గల్గునంచు "న
క్షింతలు" సల్ల, మోము వికసింపఁగనా మలిదేవరాజు నొ
క్కింత శిరంబు వంచి, హృదయేశ్వరి సిగ్గును జూచి దోసిటన్
పంతముతోడఁ బోసె తలఁబ్రాలు! సిరా సతిపోసి నవ్వఁగన్!
13

మలిదేవుండు సిరాసతి
తలఁబ్రాలను బోసికొనిరి తమ మనములలో
నెల నవ్వు, సిగ్గు దొంతర
మొలకెత్తఁగ, చూచువారి మోములు వెలుఁగన్!
14

అగ్నిసాక్షిగఁ బెండ్లాడినట్టి సతియు
పతియు ముదమున నొక పీఠిపై వసింప
చెన్నకేశవు జపియించి సేసలిడియె
బ్రహ్మనాయుఁడు నా సతీపతులపైని!
15

ప్రీతి బంధువులెల్ల దర్శించుకొను
కలను గ్రహియించుచుండెను కన్నమ, యల
రాజు, తన తండ్రియగు కొమ్మరాజు బంధు
వులకు వలసిన సౌకర్యములనుఁ గూర్చ!
16

వేదవిదులైన బ్రాహ్మణుల్ వెంట నడువ
దీప్తులెగఁజిమ్ము రాజమందిరముఁ జేరి
కొలువునందున మణిపీఠిఁ గూరుచున్న
యా సిరాదేవి, మలిదేవుఁడలకు చుండ—
17

రత్నకిరీటముం దన కరంబునఁబూనియు మందహాస్యుఁడై
యత్నము సఫలమ్మయియె నంచుఁదలంచెడి బ్రహ్మనాయుఁడున్
నూత్న వధూవరుల్ దనర, నోముల పంటగ గాంచుచుండనే
యత్నములేక రాలినవి యాతని కన్నుల హర్ష బాష్పముల్.
18

మంత్రి పఠన పరిసమాప్తమయ్యెను ! యువ
రాజు శిరముపైని రాజ మకుట
మును పురోహితుండు పూన్కి నలంకరిం
చెను, ప్రజాళిమెచ్చి జేలు వలుక ! 19

సుమ కోమలమగు జంటను
సుమములఁ దేలింపఁగోరి చోద్యములరఁగన్
సుమములు గైకొని చల్లిరి
సుమ కోమలగాత్రులైన సుదతీమణులున్ ! 20

సేనాధిపతిగ కన్నమ
నానాటి సభాంతరాన నభిషేకించెన్
పూనిక బ్రహ్మన, పూవుల
వానలుఁ గురియంగ వీరవరులుప్పొంగన్. 21

మలిదేవుఁడు రాజయ్యెను
పలనాటికి, మంత్రియయ్యె బ్రహ్మన్న ! మహా
బల శౌర్య సంపదలసిలఁ
గలిగిన సేనాధిపతిగ కన్నమయయ్యెన్. 22

మలిదేవుఁడు ప్రజలకు, పె
ద్దలకును బ్రహ్మన్నకును యథావిధిగా సం
జలి ఘటియించిన పిమ్మటఁ
బలుకఁ దొడఁగె నిలిచి తా సభామధ్యమునన్. 23

ఓ పలనాటి రాజ్య విభవోన్నత నిర్మల ధర్మ కర్మ దీ
క్షాపరతంత్రులార ! విల సద్గుణ భూషితులార ! మిత్రులౌ
భూపతులార ! వీర రసముంజిలి కెంచెడి యుద్ధ యోధులా
రా ! పరిపాలనా క్రమము ప్రస్తుతమిచ్చట జ్ఞప్తి కెత్తెదన్ ! 24

నాయన వీడిపోయినను, నాయను వారలు వేరుచేసినన్
నాయను గుంబితేన్ మరల నాయని రూపునఁ జూచుచుంటి, నే
నాయన మానలేక యడుగైనను వేయఁగఁజాల! నింక మా
నాయన, మీకు నెల్లరకు నాయనయాయన యాచుగాచుతన్.

25

కులముల మతముల పేరిట
కలహించుట కూడదెప్పుడు, కారుణ్యంబున్
తులలేని యైక్య గుణమునఁ
బలనాడభివృద్ధి చేయవలె మనమెల్లన్.

26

ప్రజలు సంపన్నులై వరలిన నదిచాలు
దాని కసూయ చిత్తమున లేదు,
ధర్మోపదేశమా దలదాల్పవలెగాని
న్యాయంబుఁ దప్పెడి నడతవలదు,
నేను రాజుగనుండు నిలుచుటయే కాని
ప్రజలన్న హీన భావంబులేదు,
రాజు ప్రజలనెప్డు రక్షింపవలెఁగాని
దండింప వలెనన్న తలఁపులేదు,

పల్లనాడు భాగ్యవంతమై ప్రజలెల్ల
సుఖముఁ బొందునట్లు చూచుకొనుటకె
రాజనైన నేను, బ్రహ్మన్న మంత్రియు
నిలిచి మీకు సేవ సలుపగలము.

27

గోబ్రాహ్మణులఁ జంపఁగోరి యత్నించుట
మరణతుల్యంబన్న మాట నిజము!
స్త్రీ బాల వృద్ధుల శిక్షింపఁబూనిన
చేటు కల్గునటన్న మాట నిజము!

అన్యాయమును వైరికైన ననుఁ దలఁప, న
మానుషమని యన్నమాట నిజము !
శరణన్న శత్రువుఁ జంపఁజూచిన చోన
మంగళమగు నన్నమాట నిజము !

పల్లెనాటివారు పౌరుషవంతులు
దారమతులఁటంచు ధరణిపైని
చిరయశస్సు నిల్పఁ జేదోడుగా మీరు
నిలిచి, కీర్తి దివ్వె నిలుపవలయు !

28

మలిదేవుఁడిట్లు పలికిన
పలనాటి ప్రజాళివార్త వార్నిధిఁ దేలెన్
సలలిత మధురోక్తి మహా
ప్రాజ్ఞలుఁడగు బ్రహ్మన్న యిట్లు పలికెన్ సభలోన్ !

29

హైహయాన్వయచంద్రుఁడౌ నలుఁగు విభుని
నీలివస్త్రాలు ధవళకాంతిం దనర్ప
గానొనర్చిన పుణ్యోదకముల వాని
నిలిచియుంటిమి పలనాటి నేలపైని !

30

అందంబులో నలునంతవాఁడే ! జూద
వ్యసనమన్నది తనకసల లేదు !
రాజ్యపాలనమున రామునంతటివాడె
ఆలిపై ననుమానమసల లేదు !
మధుర వాక్యముల ధర్మజునంతవాఁడైన
నన్నృతమాడుట యన్నదసల లేదు !
రణరంగమున నర్జునుని సాటి, వీరుల
కైయసూయను చెందుటసల లేదు !

రాజలోకమంతు రాజతఁ జేయుంచు
విపుల మందినట్టి పేరుఁబడెఁడు
పల్లెనాటిసీమ "వరకట్న"ముఁగఁ బొంది
వెలుఁగు లేనునృపతి, అలుఁగురాజు ! 31

రాజు భువినివీడ, రాజొసంగిన మాట
మంత్రిఁజేసె నాగమను, కునీతి
చేతనామె యిట్లు చీలిచెనీనాఁడు
పల్లెనాడు రెండు భాగములుగ. 32

ఈనాటికి ఫలియించెను
నేనాశించినది, ధారుణీ పతియయ్యెన్
మీ నాయకుండు మలి, నే
నానంద సుధాబ్ధికోలలాడుచు నుంటిన్ ! 33

మాదు ఆహ్వానమునకు సమాదరంబుఁ
గలుగఁజేసి పట్టాభిషేకమునుఁ జూడ
తరలి వచ్చిన మిత్రబృందంబులార
మా కృతజ్ఞతాంజలులివే మాన్యులార! 34

అని బ్రహ్మన్న వచించినఁ
జెనఁగొను హర్షాన మిత్రబృందం బెల్లన్
వినువీధినంటి నిలువఁగ
ఘనముగ మ్రోయించినారు కరతాళంబుల్ ! 35

ఆనాటి యుత్సవంబునుఁ
బూనికతోఁ గాంచి మేము పులకింపంగా
నీనాడు పల్లెనాడు మ
హానందముఁ బొందె సంచుసరిగిరి సభ్యుల్ ! 36

నలగామునకు నరసింహునకు
మలిదేవుని పెండ్లియన్న మాటను విని, ప్రే
మలు వీడి రాకపోవుట
వలనను బ్రహ్మన్న మిగుల బాధను బొందెన్ ! 37

అడ్డయొడి నుండునప్పుడే బిడ్డలంద్రు
గడ్డములు మీసములు మొల్వ బిడ్డలనుటఁ
గూడదని యంద్రు పెద్దలు ! కువలయాన
పెద్దవారల మాట తప్పిదమునగునె? 38



# కోడి పోరు

ఏమది ? కోడి కూఁతయగు ! నీ తొలికూఁతల నెన్ని భావ సం
గ్రామము లుద్భవించినవో ? రాలను సైతము మేలుకొల్పు నీ
నీమము నభ్యసించి యెట నేర్చునో కోడి ? ప్రభాత భాస్కరుం
డీ మహీజన్మమెత్తును సుమీ తొలికోడిని పల్కరించుచున్ !

1

రాతిరి నిద్రగున్నఁగ, పరామరశించుచు లేపునీ ప్రజా
వ్రాతము నెల్ల జీతమును భత్యము కోరక, నెప్పుడైన ని
ర్భీతి మెలంగి పోరునకు వీసనికై వడి కాలుదువ్వ, మా
నీతియు, పౌరుషంబును, ధ్వనించెడి నీ తొలి కోడి కూఁతలన్.

2

కోరిక లెల్లఁ దీరినవి కోమలు నిన్మలి దేవరాజు ను
ర్వీరమణీ మనోహరుగఁ బ్రీతి యొనర్చితి, పల్నాటిలో
భూరి ప్రశాంతి నిల్చెను, ప్రపుల్లితమై సమతాసుమాలు నిం
పారఁగ సౌరభంబును, మహాశుభమున్ గలిగించుఁగావుతన్ !

3

తలఁచిన కార్యముల్ సఫలితంబగు నూహలు చెన్న కేశవుం
డలరి యనుగ్రహించెను దయామతియై ! నలగామ సోదరుల్
మలికి వివాహమైనను, క్రమంబుగ రాజ్యము కట్టబెట్టి నం
దలఁ పరిదేటికో ? విధి విధానము నెట్టుల నిర్ణయించెదన్ !

4

నలగామునింపును, నాయసింగును మహానందంబు చెన్నార ము
ద్దాల తమ్ములన్ బిలి కాటన్నిలిపి ప్రొద్దుల్ పుచ్చునే తెంతురి
మ్ముల నంచెంటెమొ సంతసించితిని, యీ మూర్ఖాళ్ళు స్నేహంబుతో
నిల జీవించిన యన్నదమ్ములను సర్వేశుండు దీవింపఁడే !



5

సరగున నొక్కపారి గురజాలకుఁబోయి, కుమార సన్నిభుం
డును కరుణాయుతుండు, సుగుణోజ్వలుఁడున్, సరసుండు, నిత్యసుం
దర దరహాస శోభితుఁడు, నన్నిలనెక్కుడు గారవించు సం
స్ఫురణ మతాల వాలు నలగామునిఁ జూచెద కార్యసిద్ధికిన్ !
6

చిన్నతనంబునందు నెదిచెప్పిన నయ్యది దాటకుండ తా
నన్నిట కన్నబిడ్డవలెనై వినయంబును జూపువాఁడు నే
డెన్నఁగ నాయురాలి పలుకింతయు దాటఁగ లేనివాఁడుగా
తిన్నని మార్గమున్విడిచి దీనుఁడుగా మనుచుండె నక్కటా !
7

నలగాముం డల నాయురాలి వలలోనం జిక్కి ధర్మంబు, త
మ్ములపైఁ ప్రేమను విస్మరించి యుచితంబున్ గానలేకుండె, బం
ధుల మిత్రుల కన్నిరంతరము తా దూరంబుగా నున్న నా
యలుఁగుం భూపతి మాత్ర శోభలుట తథ్యంబంచు బోధించెదన్ !
8

అని చింతించెడి బ్రహ్మనాయునకు తానత్యంత మోదాన వ
ర్ణన భాగ్యంబు నొసంగె తూర్పు దిశ సర్వప్రాణి సంక్షేమ భా
వనుఁడై భానుఁడు ! భక్తి తత్పరతతోఁ బ్రార్థించి, బ్రహ్మన చె
న్నునిఁ బూజింపఁగ నాలయంబునకు తాసుమిత్రులున్ పోయినన్—
9

చెన్నకేశవు గుడి శిఖరాన బంగారు
కాంతి కిరణములు గంతులిడఁగ,
చంద్రవంకను పారు జలధారు నీటిపై
నునులేత వెలుఁగులు తొణఁకులిడఁగ,
వలపుల బిడ్డలన్ వదలి గూళ్ళను విడి
పక్షి సంతానంబు పరుగులిడఁగ,
ఆలమందలు త్రొక్కులాటల తోగంగ
వోలునూప్రదు చెంగనాల నిడఁగ,

నుదయభానుని కిరణంబు లుర్విఁ దాఁకఁ
బక్షు లెత్తును బధిరాంధ పటలమెల్ల
వాలనము మొదలిడె లోక బాంధవుండు
నను వణువు నెల్ల తన తేజమందు నిలిపి!
10

ఖంగుమని మ్రోసె చెన్నుని గంట తెలమి
సభను దీర్చెనంత నలగామ విభుఁడు
చెన్న కేశవుఁ గొల్చి బ్రహ్మన్న మంత్రి
క్రమముఁ దప్పక కొలువుకూటమును జేరె
11

బ్రహ్మనాయనిఁ గనుఁగొని భక్తి భావ
మలమి కొన్నది, కొలువు మధ్యమున నిల్చి
పలుకసాగె నమాత్యుఁడు ! మలివిభుండు
సభ్యులెల్లను మిగుల నాశ్చర్యమొంద.
12

పదిమంది బాగముండిన
నెదిరించెడి వారలుండరీ నేలను, సం
పదఁ బొంది మురియుకంటెను
పదిమందిని బంధుజనులఁ బడయుట మేలౌ !
13

ఆ నాగమ్మ నెమొచన్నట్టి పలుమాయల్ గ్రామ్యముల్ గాక బల్
దీనుండై మనుచున్న నా యెడ చట సంసిద్ధ ప్రపంచంబులో
భూనాథుండను పేరు మోసి నలగాముండనక్కటా ! పిండ్లికిన్
దానే వచ్చెదనన్న, నాగమ కుతంత్రం బెల్ల దానిచ్చెడిన్ ?
14

కావున నేను నేడు నలగాముని చెంతకుఁ బోయి వచ్చెదన్
నీవును వారునేకమయి నిల్చినచో పలనాటిలో సుహృ
ద్భావము లంకురించును, ప్రవర్తితమయ్యెడు శాంతిరేఖ, నీ
కె విధిఁ బోఁ చెనద్ది తెలియంపఁగదే మలిదేవ భూపతీ !
15

అనిన మఱిదేవుఁడైనఁ గాదనఁగలేఁడు
సభ్యులకు పల్కఁగాలేరు సాహసంబు
కోరి జనకుని మాటను మీరఁగలరె
పుత్రులగు వారలెన్నఁ డిప్పుడమిపైని ?

16

మమకారంబును మానవత్వమొకటై. మాధుర్య భావంబు స
త్యముతోఁగూడి, మహోన్నతత్వమును శౌర్యంబొక్కటై నిల్వ, స
క్రమ మార్గంబున హింసయేక మగుచున్, బ్రహ్మన్నయన్ పేర ను
త్తముఁడై సంభవమొందె భూమిని యుదాత్త ప్రజ్ఞ రంజిల్లఁగన్ !

17

చెన్నునిఁ బూజచేసి వికసించిన చిత్తముతోడ, రాజుతో
నన్నియు మాటలాడి దరహాసముఁ జిందెడి మోముతోడ, బ్ర
హ్మన్న ప్రయాణమయ్యె ముదమారఁగనా గురజాల ప్రోలికిన్
కన్నమదాసు, కొంత బలగంబును ముందర సాగుచుండఁగన్ !

18

అనుకొనిన యంత జరుగు కార్యములు లేవు
అనుకొనక యున్న నాగు కార్యములు లేవు
అన్నియును మన మేలునకని తలంచి
సాగిపోవలె నరుఁడు నిశ్చలుఁడు నగుచు !

19

కనకఁపు ముద్దలై కనుపట్టు జొన్న కం
కులు కొడవళ్ళతో కోయువారు,
ముదర పండిన చేను మొదలంట మునుములు
పట్టి కోయుచు కట్టకట్టువారు,
పచ్చిక బీళ్ళలో పాడియావులు తోలి
బొంగరాలాటలతో మురియువారు,
గొఱ్ఱెబొట్టెలను వాగుల నీటికోసమై
యుఱలించుకొని పోవునట్టివారు,

ప్రళయ రుద్రులవలె వడిసెల ధరించి
మంచెపై నిల్చి త్రిప్పి సంబరముపడెడు
కాపుబిడ్డలు తనకు స్వాగతమునీయ
ముందునకు సాగె బ్రహ్మన్న ముదముతోడ !

20

గురజాల పురికి బ్రహ్మన
యరుదెంచుచున్న వార్తలప్పారమున స
త్వరగతిఁ బ్రాఁకిపోయెను
పరి పరి విధములను భూమి పతియోజింపన్ !

21

పెంచిన తండ్రి, స్వచ్ఛమగు ప్రేమను మాకు "సమానపాళ్ళ"గాఁ
బంచిన తండ్రి, భూమి పరిపాలకుఁగా ననుఁజేసియున్న మ
న్నించిన తండ్రి, ధర్మమును నిల్పెడి తండ్రి, విధాతవోలె నే
తెంచుచు నుండె నేడు తన దీవనలన్నముఁ దన్పుకోసమై !

22

తల్లిదండ్రులులేని పిల్లలమగుమమ్ము
నాదరించిన విమలాత్మకుండు,
గురజాల గద్దెపైఁ గూర్చుండఁజేసిన
స్నతి ప్రేమఁగనిన దయాపరుండు,
అనుఁగుఁ బుత్రిక పేరియాలను పసుపు కుం
కుమల దీపించన కోమలుండు,
మలిదేవరాజును మాచర్ల గద్దెపై
నిలిపిన దైవ సాన్నిధ్యవర్తి,
చెన్న కేశవుఁ బూజించి, సేవచేసి
ప్రజలకెల్లను తండ్రిగాఁ బరఁగువాఁడు
నేడు నాపై నిగల తన నెనరు తోడ
వచ్చుచున్నాఁడు గురజాల వారికపుడు.

23

చిన్న తమ్ముని పట్టాభిషేకమునకుఁ
బెండ్లికిఁ బోకయుంట, గోపించునేమొ ?
బ్రహ్మనాయని కోపాగ్ని రగులుకొనిన
నాప్పువారలు గురజాల యుండఁగలరె !
24

ఏది యెట్లైన మేమెదురేగవలయు
తండ్రిగారికి ఘన స్వాగతంబు నీయ
నని తలంచుచు నుండె. నాగమ్మయు నర
సింహరాజను బాగ, లేచెను విభుండు !
25

బ్రహ్మన వచ్చుచుండె పరివారముతోఁ; నలగామరాజు స
ద్బ్రాహ్మణ వేద ఘోష లిరువంకల మ్రోయుచునుండ, నిత్యుఁడో
బ్రహ్మయొ వచ్చుచుండెనను భావము నెమ్మది మోసులెత్త నా
బ్రహ్మన పాదపద్మములపైఁ బడియెన్ పసిబాలు పోలికన్ !
26

నాగమాంబ మోము నల్లబడియె, నర
సింహరాజు నవ్వె చిన్ని నవ్వు
బ్రహ్మనాయఁడమిత వాత్సల్యమున నల
గాములేపె తనదు కరము తోడ !
27

వేడి కన్నీటిబొట్లు స్రవించుచుండ
తండ్రి కౌఁగిటిలోఁ జేరి తనివిఁజెందె
నంత గురజాల నేలు మహావిభుండు;
బ్రహ్మనాయఁడు, ప్రజలును పరవశింప !
28

నాగమ మాట కాదనదు, నాయనిపైఁగల భక్తియున్ పరి
త్యాగము చేయలేదు, దరహాసము నందు విషాద వేద నో
ద్వేగము దాఁచినట్టు పృథివీపతి యా నలగామరాజు ! నిం
కేగతి సాగునో సకలమీశ్వరుఁడే తగ నిర్ణయించుతన్ !
29

విడిదికిఁ గొంపోయెను ప్రే
ముడి కట్టలుఁ ద్రెంచి పొంగి పారలఁగ భూమీ
శుఁడు సచివు, నంత నాగమ
కడు వెఱఁగొందియును పల్కఁగా లేకుండెన్ 30

శైవమును నమ్మి తనదు శైశవము నుండి
చేతులారఁగ శివునిఁ బూజించుచుండు
నాయకురాలికిఁ బీర వైష్ణవులతోడ
కుదురునే స్నేహబంధంబు కువలయేశ ! 31

రాజ్యము హరించి మలిదేవ రాజుతోడ
బ్రహ్మనాయుని వనమునకుఁ బంపినాడు
ప్రతిభఁ జూపెద మాచర్ల వారికనుచు
నాగుఁబామయి బుసకొట్టె నాగమాంబ. 32

వివిధ సౌకర్యములు గల విడిదియందు
మిష్టమృష్టాన్నములను సంతృప్తిఁ జేయు
కొంత తడవు విశ్రాంతి గైకొనిన మంత్రి
పుంగవునిఁ జూడ నరుదెంచె భూమి పతియు ! 33

దూరదృష్టి లేని గారాల తనయుని
దరికిఁ జేర్చి పలుకు తండ్రి వోలె
బ్రహ్మనాయఁ డిట్లు పలికెను నలగాము
రాజుతోడ సుగుణరాశితోడ. 34

ప్రజలను పాలన సేయుచు
స్వజనులఁ బోనాడు వాఁడు ప్రజలను పాలిం
చి, జయము పొందఁడంచును
సుజను లెలుంగెత్తి చాటుచుండిరి పుత్రా ! 35

పెండిలి సూడవత్తువని పెంచిన తండ్రిని నేను, నీదు త
మ్ముండును, మామ, యల్లుఁడును భూరి పరాక్రమశాలి నాదు పు
త్రుండును, బంధువర్గమట ప్రోవలు చూచుటెగాని, మీరు రా
కుండుటచేత చింతిలితి మోయి కుమార నిజంబు చెప్పితిన్ ! 36

ఎందరు పుణ్యమూర్తు లుదయించఁగ లేదు మహీతలాన ? వా
రందరు తమ్ముఁ గుఱ్ఱల ప్రియంబునఁ జూడఁగలేదె ? యెన్నఁడో
మ్రందిన వారికీర్తి యసమానమటంచనుఁ బల్కరే ? జగ
ద్వందిత కీర్తియే నిలుచు, తాపము కోపము కీర్తిఁ దెచ్చునే ? 37

అలుగుం భూపతి పుత్రులందున నసూయా ద్వేషముల్ రేగి చం
చలులై పోయిర నైకమత్యమున తేజం బెల్లఁ బోనాడి, యీ
పలనాటన్ సుఖశాంతి సంపదలు నిల్వం బూన లేదంచు లో
కులు వాక్రుచ్చిన తండ్రి యాత్మ కెటు చేకూరున్ సుఖంబచ్చటన్ ? 38

ఆలోచింపుము, భేదభావములు శ్రేయంబిచ్చి రక్షించునే
మీలో మీరు నిరంతరంబు కలహంబే కోరి జీవించుచో
నేలీలన్ మన రాజ్యముల్ నిలుచు తండ్రీ ? శత్రుసేనల్ సదా
నాలోచించు పరాయి రాజ్యముల స్వాహాచేసి పాలింపఁగన్. 39

పదుగురు మిత్రులున్న పగబట్టెడి శత్రువులుండబోరు, సం
పదలనుఁ బొందుకంటె పదిమందిని మిత్రులఁ బొందియుండినన్
ముదమునుగల్గు, ప్రేమ పరిపూర్ణుఁడు నా మలిదేవరాజు నీ
పదములు భక్తితోఁ గొలువ వచ్చెను బంధువులుల్లసిల్లఁగన్ ! 40

నేనిటకేగు దెంచినది నిన్నును, తమ్మునిఁజూచి మీ బహిః
ప్రాణమె యైనయట్టి మలిరాజుకు మీకును మంచి భావముల్
బూనికఁ గూర్చ కోసరమెపో ! మిముఁజూచితి పండువయ్యె నా
మానసమందు శాంతి కళమానుగ నిల్చెను పుత్రరత్నమా ! 41

అని బ్రహ్మన్న వచించిన
వినయము, సంతసము వెల్లివిరియఁగ వదనం
బును లేపి పలుకు నలగా
ముని చెంతకు నాయురాలు బుసబుస వచ్చెన్ ! 42

రెండు చేతుల యందున రెండు బెరస
కోడిపుంజులఁగొని యుసికొల్పి విడిచె
నాయురాలు నాగమ ! బ్రహ్మనాయు మదిని
వింత కోర్కులు రేగి కవ్వించుచుండ. 43

కోడిపోరన్న బ్రహ్మన్న కోరమీస
ములు మహోత్సవమున దువ్వి పొంగి పోవు
నది యెఱింగిన నాగమ్మ యదనెఱింగి
వదలె పుంజును కేళికాహ్వానమనఁగ. 44

ధర్మనందనుఁడవని జూదంబు వలన
దానకర్ణుఁడు తన దానధర్మమునను
కష్టములఁ దెచ్చుకొనిరి నిక్కముగ ! కోడి
పోరువలన బ్రహ్మన యేమి పొందఁగలఁడో ? 45

ఒక పుంజు పోరఁజూచెను
నొకటి గరిడి విడిపోయె ! నుత్సాహంబున్
బ్రకటించి నాగమాంబయుఁ
ఒక పకమని నవ్వి యిట్లు పలుకం దొడఁగెన్ ! 46

పారిపోయెను బ్రహ్మన్నగారి పుంజు
పీకఁజైవి తెచ్చె సురజాల వారి పుంజు
శాంతి వచనాలు వల్కు నాసామి పుంజు
పారిపోవక గరిడిలోఁ బోరఁగలదె ? 47

అనవిని, బ్రహ్మనమడి గు
ప్పున రగిలె పరాభవాగ్ని ! పోయెడి పుంజం
గని "చెన్న కేశవా"యన
రణమున కేతెంచి పుంజు రవ్వలు రాల్పన్ ! 48

అందరు చూచుచుండ భయమంది తొలంగిన కోడిపుంజు మ
ధ్యందిన భానుమండల విధంబున తీక్ష్ణ విలోకనంబు ల
న్మందుకు దూకి పోరునకు పొంచిన పుంజునుదాఁకె ! తాఁకునన్
భ్రమించిన పుంజుతోడ నవమానము నాగమ పోయుచుండఁగన్ ! 49

మర్త్యుఁడే పల్లెనాటి బ్రహ్మన్నయన్న
జగము వెలిఁగించు కారణజన్ముఁడనుచు
నచటఁ జేరిన ప్రజలెల్లరనఁగ, వికట
హాస మొనరించి నాగమ్మయని యెనిట్లు— 50

పందెము లేకయేఁ బోకుచు
క్రుందిన, బ్రదికినచునది సమానము కాదే
పందెమున మమ్ముఁ గనుఁగొని
పందలుగా పారిపోవె బ్రహ్మన పుంజుల్ ! 51

కవ్వించు మాటలను విని
నవ్వుచు బ్రహ్మన్న మంత్రి— నాగమ ! నేడీ
కవ్వింపు లేల ? రేపే
నవ్వే సుధాధిపునితోడ నయదెంచెదఁబో 52

అని పయనమయ్యె మాచర్లకును సచివుఁడు
వికలమయ్యెను నలగామ విభుని మనసు
పట్టపగ్గాలు లేని సంబరము నందె
మంత్రిణిగఁ జేరి పరిమార్చ్చ మారినారి ! 53

తండ్రితోఁ గోడిపోరును, తమ్ముగుఱ్ఱ
తోడి పందెముతోడుట పాడిగాదు
వలవదను నలగామతోఁ జెలవివార
నవ్వి యిట్లనె మంత్రిణి నాగమాంబ !

54

పొరుగు రాజ్యము మన బంధువులదైయున
కలుషకొనఁ జూచుచుండ్రు పక్కలనువారు
రాజ్యమున శాంతిలేక యరాజకమగు
కొన్నినాళ్ళకు రాజ్యమే సున్నయగును.

55

శాంతిన్ భూమిని నిల్పుకోసరమె దీక్షంబూనినా మంచు వి
భ్రాంతిన్ బొందక మంత్రితానగుట నీచంబైన కోర్కెన్ గదా !
భ్రాంతిం జెందకు, శాంతికై నిలుచునా బ్రహ్మాస్త్ర తంత్రాంగముల్
వింతల్ నీ కనులారఁ జూచెగవుపో, వేయేల భూవల్లభా !

56

కోరిక లేని వాఁడయిన కోడినిఁ జూచిన పొంగి పోవుచున్
బోరికివత్తు మెల్లియనిఁబోవఁగఁ జాలునె జేవిహీనకై ?
వారలు పోటికై తరలి వచ్చుచునుండఁగఁ బోరలేక, న
వ్వారలు పీకలంచుఁ బగవారి నుపేక్షయొనర్తురే ప్రభూ ?

57

రాజు నోడించి, యడవుల రాలఁగలిపి
ర జుపివు గనేక ఛత్రంబు క్రింద
నంత పలనాడు నేలిన యలుఁగురాజు
నాత్మతృప్తి వహింపదే యధిప చెప్పుము ?

58

అది యటుంచుఁడు, కోడిపోరనిన ధర్మ
యుద్ధమేయగు, వీర రాజోచితమగు
టక్కులు, టమారములు మాని, డాబుమాని
క్రీడలను రాజ్యమును గెల్వ కీడదేమి ?

59

అనెడి నాగమ్మ పలుకులింతైన వినక
కోడిపోరన్నచో నీయకొనఁడు రాజు
జారె భానుండు పశ్చిమాశా జలనిధి
జరుగఁబోయెడి పచ్చిమోసమునఁగనలి. 60

స్త్రీల బుద్ధులు ప్రళయంబు సేయు ననెడి
యార్య వాక్కులు గమనింపనగును ! బ్రహ్మ
నాయునుసికొల్పినది ముందు నాయురాలి
కెన్ని యుక్తులు పన్నునో యెవ్వఁడెఱుఁగు ! 61

సమధి కోత్సాహమంది మాచర్ల విభుని
రాచమల్లుండు నగునలరాజును, తన
మామ కొమ్మనఁ దోడ్కొని మంత్రి బ్రహ్మ
నాయుఁడు వెడలె కేళీ పరాయణుఁడయి. 62

ఆ మేలి తలపాగ యందమే మనవచ్చు
        మణిమయ మకుటమే యనఁగవచ్చు !
ఆలలాటమున నామాలనే మనవచ్చు
        తిన్నని తిలఁపుగాఁ దెలియవచ్చు !
ఆ కోరమీసాల యదటునే మనవచ్చు !
        నిమ్మకాయలు కోరి నిలుపవచ్చు !
ఆ ముఖ మండలంబరయనే మనవచ్చు
        బ్రహ్మ తేజంబుగాఁ బలుకవచ్చు !

మిగుల పండినట్టి మిర్యపు పండ్ల ర
క్తారుణిమలు పుంజులందు వెలుఁగ
కదలి ముందు నాగు కన్నమదాసుతో
సచివుఁడలరుచు గురజాలఁ జేరె ! 63

కోడిపోరును జూడఁగా కూడివచ్చి
రెల్లవారును, మండలాధీశ్వరులును
చుట్టుఁ జేరిరి జేజేలు కొట్టుకొనుచు
గరిడి యొప్పినదొక ఘాలికలను వోలె ! 64

నాయురాలు, విభుఁడు నలగాముఁడును నర
సింహు లొక్కవైపుఁ జేరినారు
బ్రహ్మనాయుఁడు మలిప్రభువును, అలరాజు
కొమ్మన యొకవైపు కూడినారు ! 65

అంతట నాగమాంబ వినయంబున లేఁచి నమస్కరించి, ధీ
మంతులు, మాన్యులైన మతిమంతులు, మిత్రులు, మండలాధిపుల్
సంతస మొందివచ్చి గురజాలను ధన్యమొనర్చినారు ! నే
డెంతయొ మంచిరోజు ! పరమేశ్వరుఁ డిచ్చుత మీ యభీష్టముల్ 66

కోడిపోరన్న నెల్లరు కోరునదియె
ముందు పందెములను నియమములు వచింతు
ఆప్త ధరణీతలాన ! తప్పొప్పులరయు
రాచమల్లుఁడయిన యలరాజు తెగును. 67

ఓ సుజనులార ! పోరున నోడిపోవు
వాఁడు సప్త వత్సరములు వనములందు
గడుపఁగావలె రాజ్యంబు విడిచిపెట్టి
సమ్మతంబైనచో పోరు సాగునింక ! 68

అని నాగమ్మ వచించెను
వినువారల మనములమిగుల విస్మయ మొదవన్
తన యంగీకారముఁ దె
ల్పెను మలిదేవుఁడును, ప్రజలు విస్మయమొందన్ !
 69

పలనాటంగల పౌరుషం బోకట రూపం బొందెనా నొప్పు ను
జ్జ్వల శౌర్యాంచితుఁడైన కన్నమ, మహాభాగ్యోదయంబౌ ప్రతి
ష్ఠలనుం బొందిన బ్రహ్మనాయని పదాబ్జంబంటి, మాచర్ల భూ
తల నాథుంగని మ్రొక్కి యాజ్ఞఁగొని కర్తవ్యంబు పాలింపఁగన్ — 70

వీర రసంబులోన ప్రభవించిన యుత్తమజాతి పుంజునుం
బోరుట కోసమై విడిచె! బోరను ముందుకు సాఁచి యద్దియుం
జేరిన వారలంగనుచు, చిక్కని రెక్కలు విప్పి శౌర్య మిం
పారఁగ "కొక్కొక్కరో" యనుచు నారచి నిల్చెను వైరికోసమై! 71

అదిగని పోతరాజు దరహాసము చిందఁగ నాయురాలికిన్
హృదయము చిక్కబట్టి పరికించెడి నా నలగామరాజుకున్
పదములనంటి మ్రొక్కి, నిజ పౌరుష దీప్తులు చిందు పుంజునున్
వదలెను! పొంచి పొంచి యది వైరినిఁదాకఁగఁ బయ్యెత్తఁగన్ — 72

రెక్కలల్లార్చుచు కొక్కొక్కరోయని కూసి
ప్రక్క ప్రక్కన నిక్కి నిక్కి చూచి,
కాలుదువ్వుచు జూలు కదిలి ముందుకు జార
ముక్కు ముక్కునఁ జేర్చి పొడుచుకొనుచు,
మెడలు ముందుకునాచి, పడిలేచి కాళ్ళతో
నన్ను బట్టెడిరీతి తన్నుకొనుచు,
ముక్కు మూతియు కాళ్ళు, బొండిగలును చిట్లి
రక్తపు బొట్టులు రాలఁగఁ బోరి

గర్భశత్రుత్వ మట్టులా గరిడిలోన
ప్రాణములు లెక్కగొనక నిర్భయత చెలఁగు
పుంజులనుఁ గనినంతనే పులకరించి
సారె సారెకు "భళి" యంద్రు వీరవసులు! 73

ఖరఖరు దీప్తిని వెల్గుచు
పసవిడి మాచర్ల పుంజు ఫట్టున దన్నెన్
గిరగిరమని సుడిదిరుగుచు
గురజాల పురీశు పుంజు కోయని కూలెన్ !
74

కోరమీసము బ్రహ్మన్న కోరిమీటె
వెలిఁగ మలిదేవభూపతి వీక్షణములు
నాయకురాలి వదనమువనతిని చెందె
కలతపడు చుండెనా నలగామరాజు !
75

తులలేని సంతసంబున
వెలిఁగెను మాచర్లవారి వీర బలగమున్
కళలేక వికలమై ఫల
ఫలమని గురజాలవారి బలగంబదరెన్ !
76

పోతరాజు పేరొక్కని చేతినుండి
కోడిపుంజునుఁగొని యుసికొల్పి విడిచె
గరిడి లోపల మలిదేవుఁగనుచు వికట
హాస మొనరించి, ప్రేక్షకు లదరిపడఁగ !
77

గుండె పగులఁగనవి తన్నుకొనుచుఁ బోర
చోద్యమగు గురజాల పుంజునకు నొక్క
దెబ్బయైనను లేదు ! సందియమునంది
బ్రహ్మనాయుని వర్గంబు బాధపడఁగ—
78

మొక్కవోని శౌర్యము నెల్ల చిక్కబట్టి
నారె సారెకు తాఁకు మాచర్ల పుంజు
అలసి వేసారి యది సొమ్మసిలుచుకొని
బాధ నొందదు గురజాలవారి పుంజు !
79

"చెన్న కేశవా" యనియె బ్రహ్మన్న కుమిలి
మోసమని లేచె కన్నమదాసు కనలి
మోము నలుపాయె మలిదేవ భూమిపతికి
సంశయము నందె నలరాజు సాధుశీలి !

80

ఒక్కసారి దేహము నందున్న శక్తి
వేగ క్రోడీకరించిను భిల్లుమనఁగఁ
దన్ని రణభూమిలోఁబడి కన్నుమూసె
రక్తసిక్తమై మలిదేవరాజు పుంజు !

81

గురజాలవారి పుంజును
బిరబిరఁ గొంపోయినారు భీకరముగు సం
గరరంగమందు నిలుపక
మురియుచు నిందెంత కలదొ మోసము తలఁపన్ !

82

మగతనంబులేదు మాచర్ల వారి క
టంచుఁ బలుక మిగుల నాగ్రహించి
కత్తిదూసి లేచె కన్నమదాసుండు
బ్రహ్మనాయుఁ డతని బట్టియాపె.

83

అలిగి మాచర్లవారల న్యాయమనిరి
న్యాయమని గురజాల వారనిరి ! న్యాయ
నిర్ణయము చేయు నలరాజు నిలిచి యిట్టు
లనియె నా పాలికలని మధ్యంబునందు.

84

పోరికి ముందుగ విడిచెడి
వారల పుంజులను నెదుటి వారలుఁగని యీ
వీరులలో సందేహ ని
వారణ సేయుదురు ! పిదప వాదులు తగునే ?

85

గురజాలవారి పుంజునుఁ
బరికింపఁగలేదు ముందు బ్రహ్మన వర్గం
బిరు పక్షములకు నేత్తి
ర్పరినై పలుకాప, విరుట భావ్యంబగుతన్ !
86

దురితంబు చేసినారని
తరుణము విహవాడి పలుక తగ దుర్వారలో
శిరమందు దురద కలిగిన
కొర వింగొని దాని గోకికొనుటల్ తగునే ?
87

కనుక బ్రహ్మన్న వర్గంబు వనములందు
గడుపవలె సప్త వత్సర కాలము ! తమ
రాజ్యమును వీడి, పందెము క్రమముఁదలఁచి
యున్న, బ్రహ్మన్న తలవాల్చి ఖిన్నుఁడయ్యె !
88

బ్రహ్మ వ్రాతకు దాటనెవ్వరి వశంబు
బ్రహ్మనాయులు నటనుండి పయనమైరి
కానలకుఁబోవ ! విధియెంత కఠినుఁడోర
మోస మొనరించు వారికే మొగ్గచూపు !
89



12)

# వ న వా స ము

నీతి నియమంబులెల్ల చన్నీటఁ గలిపి
నాయురాలు చేసిన దురన్యాయములకుఁ
గనలి, కన్నమదాసుండు కనులు రక్త
వర్ష ముంజిమ్మని రీతిఁ బలుకసాగె!

1

ఎంతటి ఘోర పాతకమ దెంతటి నీతి విదూర కృత్య మెం
తెంత కడింది మోసమది! యెంతటి ఘాతుక చర్య యద్ది! యెం
తెంతటి నీచకార్యమది! యెంతటి దారుణ వంచనంబహో
యెంతటి సిగ్గుమాలు పని! హీనము పోనర జాతియుద్ధరన్!

2

న్యాయముఁ దప్పి పోరుదు గెలుపన్నదియున్ గెలుపౌనె? భూమిలో
న్యాయము మాటలాడినవాఁడెట్టైన జయింపఁడె? పిల్లి కన్నులన్
మూయుచు పాలుద్రాగ, కనుమూయుదురే ప్రజలెల్ల! లోకమున్
మూయుట సాధ్యమౌనె యెటుల మాపటిచీఁకటి నెటువంటి వానికిన్?

3

ఈడుం జోడును లేక సంగరములో నెన్నాళ్ళు పోరాడినన్
క్రీడోత్సాహము నంది గెల్చెడి చెలాకీగల్గు మా పుంజు ని
ట్లోడింపంగన ధర్మ మార్గములనే యొప్పింత్రు! లేకున్న నే
నాడున్ బ్రహ్మన పుంజులన్నను మహానందంబు నందెల్గవే!

4

అనలము మూటఁగట్ట నెవఁడైన కడంగునె? నిల్చునన్న భ్రాం
తిని వెలలేని సత్యమును నిల్వున పాతువేయఁ జాలునే
వనములనున్ననేమి? తన వారిని వీడిననేమి? ధర్మ చిం
తనమది నున్నచాలు భువనంబుల నేలఁగవచ్చు దీక్షతో!

5

పలనాటిసీమలో బ్రహ్మన్న పుంజులు
నోడిపోవుట వగలాడి మహిమ !
మాచర్ల వారల మగతనంబును తూల
నాడుటయూ వగలాడి మహిమ !
మా పుంజు చేతిలో నా పుంజునకు చావు
మూడకుండుట వగలాడి మహిమ !
గెలిచిన పుంజు ఫక్కినిఁ గనరానీక
పీడిపోవుట వగలాడి మహిమ !

అన్నదమ్ముల ప్రాకపూల నంతులేని
భేద భావంబుఁ గల్పించి వీరభూమి
భాగములు చేసినట్టి మా నాగసాని
కోరవిప్పి నర్తించు విషోరగంబు

6

అని పల్కుననుఁగుఁ బుత్రునిఁ
గనుఁగొని బ్రహ్మన్న పల్కె — కన్నా ! మనకీ
వనవాస క్లేశము దె
చ్చిన యదనేనే కుమార ! శిక్షింపుమయా !

7

పసలేని మాటలును, దు
ర్వ్యసనంబును గల్గి పోవునందున రాజ్యం
బు సమస్తంబును బెట్టితి
నసలగు దోషంబునాది, యనఘుమ పసలన్ !

8

అన్నదమ్ములకు స్నేహముఁ గూర్పవలెనంచు
గుఱజాల పురికినే నరుగనేల ?
వరిగితిపో; నాగమాంబకు నుసికొల్పు
బుద్ధి యుత్తరినట్లు పుట్టనేల ?

పుట్టెనుపో, కోడిపోరని వినినంత
నింతలోనే నిచ్ఛగింపనేల ?
నిచ్ఛగించితినిపో, నేనాడు నోడని
పుంజు ప్రాణములట్లు పోవనేల ?
మచ్చలేనివాఁడు మలిదేవభూపతి
రాజ్యహీనుఁడై పరాయి పంచ
బ్రతుకఁ జేసినట్టి పాపాత్ముఁడైన యీ
బ్రహ్మనాయఁడింక బ్రతుకరాదు ! 9

పెంచెడి జనకుఁడె తనయులఁ
ద్రుంచినచో తండ్రిదెంత దోషము తలఁపన్
వంచకుఁడ నేనె ! తనయుల
ద్రుంచితి, రాజ్యంబుఁ పోలఁగఁ ద్రోచితి పుత్రా ! 10

నేనే కారణమింత కీడునకు తండ్రీ ! జూదమందెందరో
భూనాథుల్ నిజ రాజ్యసంపదల నుంబోనాడుటం జూడనే
ప్రాణంబుండినదెన్ని మాటులకు నీ పాపంబునే సేతు, న
న్నీనాడే తెగటార్చి ప్రాణములు బొందిన్వీడఁగాఁ జేయుమా ! 11

అనిన కన్నమదాసుండు నదరిపడియె
కొమ్మరాజును అలరాజు గొల్లుమనిరి
మలివిభుని కంట బాష్పధారలు రలినవి
శోకదేవత కట మంచిచోటు దొరికె ! 12

కొమ్మనలేచి వచ్చి యతి కోమలు బ్రహ్మనఁజేరి యిట్లనున్
ఇమ్మహి శాంతి ధర్మములనేలఁగఁ జాలెడి వాఁడవీవ ! శౌ
ర్యమ్మును శాంతమున్ గలిసి రాజిలువాఁడవు నీవ ! నిత్య స
త్యమ్మును చాటిచెప్ప నవతారముఁ దాల్చినవాఁడవయ్య దీ
నమ్ముగ నిట్టుఁబల్క తగునా నినువంటి మహానుభావులున్ ? 13

రాజోచితముగు క్రీడకు
నీ జగతిని నెవ్వరిచ్ఛగింపరు ? జయమే
రాజులకు నెల్లఁ గలిగిన
భూజను లందెవ్వరోడిపోదురు తలఁపన్ ?

14

ఏడు సంవత్సరములన్న నెంతలోన
గడచిపోవును కాల చక్రంబునందు
నిట్టి మాటలనెల్లను కట్టిపెట్టి
చేయవలసిన దేమియో చెప్పుమనియె !

15

కనులనీర్నించి, గద్గద కంఠమెత్తి
పలికె నలరాజు గురుదేవు పదములంటి
మీకుఁ జెప్పెడి జ్ఞానంబు మాకు లేదు
మీకు వలవని బ్రదుకద్ది మాకువలదు.

16

పొదుగు విడువని బిడ్డయై పొంగిపొరలు
దుఃఖ వార్ధులందునఁ దూలిసోలి
తండ్రి పదముల కన్నమదాసు వ్రాలి
కదలనీయఁడు, పాదంబు వదలిచనడు !

17

ఆపదలందు దైవము సహాయము చేయుచునుండు నెప్డు ! దీ
ర్ఘా పరతంత్రమై మనుజ జాతి మెలంగుచు నాగిపోవలెన్
యే పని నెప్పుడెట్లు వెలయించుట దేవుఁడెఱుంగుగాని యీ
తాపము కోపమున్ జరుగు దానిని యాపుకె ధారుణీస్థలిన్ ?

18

బ్రహ్మనాయుఁడు శోక వివర్ణ వదను
లగుచు చింతించు తనవారి ననుసరించి
పుణ్య కృష్ణాపగా తీరములను చేరె
సమయబద్ధుఁడై వనముల సంచరింప !



19

గలగల ముత్యాల నొలుకఁ బోసినరీతి
నుల్లసిల్లుచు సాగునొక్క-చోటఁ
పాలరాశుల వంటి పారాడి తళుకుల
నొప్పుమఁ బ్రవహించు నొక్క-చోట,
చిరుతరంగాల క్రొన్నురుగులు విరఁజిమ్మి
యుత్సాహమునఁ దేలు నొక్క-చోట,
సుడిగుండమై చూడఁజూడ దుస్తరమగాచు
నుగ్రమూర్తిగ నిల్చు నొక్క-చోట,

పల్లెనాటికెల్ల పైరుపచ్చలతోడి
దీప్తినిచ్చునా నదీమతల్లి
కృష్ణవేణిఁ గాంచి కేల్మోడ్చి భక్తిమై
నంజలించె బ్రహ్మనాయఁడంత !

20

కృష్ణవేణీ తరంగిణి కెరటములను
నలరివారలు స్నానంబు లాచరించి
మనసులందలి బాధలెల్లను తొలంగి
యరుగుచుండిరి యడవి మధ్యంబునందు !

21

శ్రీరామచంద్రుఁడు సీతా లతాంగియు
వనవాస శోకంబు పడయలేదె,
ధర్మనందనుఁడును, తమ్ములు వనముల
పలుయాతనల నోర్చి బ్రదుకలేదె,
నలమహారాజు, సుందరియును నడవుల
కష్టనష్టములోర్చి గడుపలేదె,
సత్యసంధుఁడు హరిశ్చంద్రుండు సకలంబు
విడనాడి దేశాల నడువలేదె,

సమయ భంగముకా నీక సత్యనిరతి
వనములందున్న బ్రహ్మన్న వర్గమునకు
వన్నెవాసియు తరుగునే ? వక్రమార్గ
మనుసరించిన వారికి ఘనత కలదె ? 22

అరిగి, శ్రీశైల క్షేత్రంబునందు మల్లి
కార్జునునిఁ బూజ గావించి, వారు మారి
కాపురంబునఁ గొన్నాళ్ళు గడిపియువల
తిరిగి వచ్చిరి మండాదిపురము జేర. 23

వారట నున్న వార్త వినవచ్చెను నాగమకంత నామెయున్
వారల యూలమందలను బల్లెములం బొడిపించి చంపి నం
బోరొ నరింపలేని తమ పూనిక చొప్పున శాంతచిత్తులై
చేరిరి "పీరమేడపి"ని చీకులు చింతలు నంతరింపఁగన్ 24

సాధ్వి ఐతాంబ తనదగు సదనమందు
బ్రహ్మనాదులకెలమి సపర్య సేయ
గడచిపోయెను కాలచక్రంబునందు
నేడు సంవత్సరంబులు నింతలోన ! 25

తొలకరించిన వలపులు పలుకరింప
చెఱకు వింటి జోదుగమారి చెలఁగు చుండె
బాలచంద్రుఁడు యౌవన ప్రాంగణమున
కోడె వయసున నల్లరి కొడువయున్నె ? 26



## రా య బా ర ము

కమ్ముకొనియున్న కాఱు మేఘాలు తొలఁగి
స్వచ్ఛమై తోఁచెనాకాశపథము ! కామ
క్రోధ లోభ మోహములను కూలఁజేసి
స్వచ్ఛమై వెల్గు మునివరు స్వాంతమట్లు.

1

రాజ్యరమ నెడబాసి ఘోరమగు నడవి
సప్త వత్సర కాలంబు సమయబద్ధు
లగుచు గడిపిన మలిదేవుఁడాది వీరు
లంత యోజన చేసెదు నంతలోన— —

2

పోయిన నిర్ణయించినది పూనికతో నెరవేర్చినాము ! యె
వ్వారల రాజ్యమున్ తిరిగి వారలకా గురజాలనేలు భూ
మీ రమణుండు నీయఁడు సుమీ ! తన తమ్ముఁడు భిక్ష కోరి యూ
రూరను సంచరింపనయయో తనకున్ తలవంపు కల్గదే !

3

పట్టెఁడు కూటికోసరము బంధుల మిత్రుల యుద్ధభూమిలో
పొట్టనఁ బెట్టికొందు సుఖ భోగములెవ్వరు కోరుకొంద్రు ? స
మ్రాట్టుగ నున్ననేమి, యభిమానముతో నొక పూఁటఁజూచు ని
ప్పట్టున నున్ననేమి ? రణవాంఛకు నామది దూరమయ్యెడున్ !

4

శాంతి సౌఖ్యమంది సర్వ సంపదలంది
స్వర్గమగుచు వెలుఁగు పల్లెనాడు
రక్తసిక్తమగుచు ప్రాణాలు వెలిపెట్టు
యుద్ధమందు దిగుట కోర్వలేను.

5

ఇన్నాళ్ళు బ్రదుక లేదే
యన్నియుఁ గోల్పోయి వనములందున? నన్నే
మూన్నాళ్ళ జీవితంబున
కున్నా మదియుగ్రగ రణముఁగోరదు మామా

6

అని మలిదేవుఁడు పల్కిన
వినుచును కొమ్మన్న కితర వీరుల కెల్లన్
మనముల నత్యాశ్చర్యం
బును కల్గఁగ బ్రేలునిడిరి ముక్కులనంతన్

7

కరవాలంబునుఁగొని భీ
కరమూర్తిగనిల్చి పల్కె కన్నమదాసుం
డరి వీర భయంకరుఁడై
దరిఁజేరిన వారిఁజూచి ధైర్యస్థితుఁడై!

8

తేజము వీడెదేల మలిదేవ నృపాలక? వైరిమూఁకను
గ్రాజిని గెల్వఁ జాలెడి మహామహులౌ మన వీర యోధులున్
బూజును దుల్చి ఖడ్గములు పూని రణంబున కేగు దెంత్రుపో
గాజులు వేసికొందురె మగంటిమి గల్గిన వారలెప్పుడున్!

9

ఆజ్ఞ నొసఁగిన నొంటిగా నరిగి నేను
పాము పడగనీడలు కోరువాఁడగు నల
గామరాజునుఁ గొని తెచ్చి కావరంబు
నణఁచి కైకొందు మనము రాజ్యంబు వేగ

10

అనిన, బాలచంద్రుఁడు పిల్చి యుండరకును
వందనము సల్పియన్నకు బ్రక్క నిలిచి
చుట్టుచేరిన వారలఁజూచి తండ్రి
బ్రహ్మనకు మ్రొక్కి మిగుల సంబరము పడుచు—

14 11

సమరోత్సాహము నిండి వెల్లువదితో శౌర్య ప్రతాపాగ్ని, రో
షము దీపించెడి నేత్ర పద్మములతో "సామంతరాగోల" హ
స్తము నంబూనుచు బాలచంద్రుఁడనియెన్ ధాత్రీశుఁడున్ మిత్ర లో
కము భీతిల్లగ బ్రహ్మనాయుఁడును చుక్కల్ చూచి లెక్కింపఁగన్
12

గాజులు ధరియించెడి ని
స్తేజులు పలనాటలేరు! ధీమంతులు, ను
గ్రాజి భయంకరులై రిపు
తేజము హరియించునట్టి ధీరులు దక్కన్!
13

అన్న కన్నమదాసు తానన్నమాట
లఖిల వీరలోకం బాడునట్టిమాట
లానతిచ్చిన తలలతో నాడుకొందు
నాలమునఁ గెల్చి మనము రాజ్యంబు గొందు!
14

అదివిని బ్రహ్మనాయు హృదయంబు వికావికలయ్యె, శాంతి సం
పదలకు తావలంబయిన పచ్చని యీ పలనాటిసీమలో
కదనము రేపి రక్తమును కాల్వల నింపఁగఁజూచు కోరికల్
ముద మొనరించునే పరమ పూజ్యుఁడు బ్రహ్మన మంత్రి కెప్పుడున్!
15

అంతట బ్రహ్మనాయుఁడు మహా వ్యథ చెందుచు నిట్టులపల్కె, ధీ
మంతులు యుద్ధ యత్నములు మానిచరించుచు, మిత్ర భావమున్
శాంతినికోరి యిద్ధరణి సత్ఫలితంబులు బొందు చుందురీ
వంతలవేల? యుద్ధమును వాదనలేల? వినుండు దీక్షమై!
16

బందుగు లందరిందునిమి— పాండవ కౌరవులేమి సంపదన్
బొందఁగఁ జాలినారు? విరబూసిన యీ పలనాటి వృక్షమున్
కొందరు చేరి యుద్ధమను గొడ్డలితో త్రెగవేసి చీల్చినన్
పొందునదేమి? రక్తనదముల్ ప్రవహించిన నేల పండునే?
17

ముళ్ళపై నియున్న ఫుట్టంబు నేర్పుమై
నూడఁదీయవలయు నోర్పు గలిగి
బలము గలదటంచు బరబరలాగిన
ఫుట్ట మంతరించి ముక్కలగును.
18

బవరము సేయనందు నిరుపక్షము వీరులుఁ గూలుచుండ్రు ని
క్కవముగ ! పీనుగుల్ తలలు కుప్పలు వోసిన రుద్రభూమిలో
నవసిన వచ్చు సంపదల నంతమటంచు వచింతురే ? స్మశా
న వనులనేల, వచ్చెడి ధనంబు మనంబున శాంతినింపునే ?
19

శాంతియె సర్వజీవులకు సౌఖ్యమునిచ్చును శాంతియన్నదే
వంతల నెల్లవాపి బలవంతులఁ జేయును, శాంతి మార్గమే
చింతల చిక్కులన్ సమయఁ జేయును, శాంతిని కోరువారికా
వంతయు బాధకల్గదు, ప్రపంచము శాంతిని ప్రస్తుతించెడిన్.
20

స్థానా స్థాన వివేకి
జ్ఞానము గలయట్టి యొక్క సద్గుణ శీలున్
బూనిక గురజాలకు మన
వానినిఁ బంపుడమ రాయబారము సేయన్ !
21

గుణ గణములందు మిన్న మ
దనుగుంట్రియ శిష్యుఁడైన యలరాజ, తనన్
మన రాయబారిగా కొ
మ్మన యనుమతితోడఁ బంప మంగళ మగుతన్ !
22

అనవిని కొమ్మరాజనియె నాసచివాగ్రణి తోడనిట్లు, మ
త్తనయుఁడు చిన్నవాఁడు, భయదారుణ ఘోర విషాగ్ని కీల గు
ప్పున రగిలించు మంత్రిణి, విభుండగునా నలగామ కొల్వునం
దున, యలరాజు కేవితులఁ దూగెడి వాక్చతురత్వ మచ్చటన్ ?
23

అనిన బ్రహ్మన్న కొమ్మన్న నరసి యిట్లు
పలికె, నలరాజుని తనూభవుఁడు కాన
బాలుఁడై తోఁచు, నిఖిలార్థ భావములను
లలిత లలితంబుగాఁ జెప్పగలఁడతండు 24

మన్నవం జేయు తనదు జామాత పల్కు-
పల్కులెల్లను గురజాల ప్రభువు ! మలికి
నాప్తబంధుఁడు నోట సత్యమును పల్కి-
తగవు తీర్పఁగ జాలెడి దక్షుఁడతఁడు. 25

కనుక ననుమానమన్న దెందునను లేక
వాక్ప్రతుసుఁడగు నలరాజుఁ బంపు మనిన
నెట్టకేలకు కొమ్మరాజీయ కొనియె
నంత నలరాజు ప్రాంజలిపూచు నిలిచె ! 26

బ్రహ్మనాయుఁడు తనదు దీవన లొసంగి
పలుక వలసినదెల్లను తెలిపి, వెంట
తనదు పుత్రుఁడు కన్నమదాసు ననుప
రాచమల్లుఁడు కానయ్యె రాయబారి ! 27

కన్నమాల్యుఁడు భీకర ఖడ్గమూని
ముందు నడువఁగా గురజాల పురము చేరఁ
బోవుచుండెనా యలరాజు పుణ్యమూర్తి
మంజులాశయములను సన్మార్గవర్తి ! 28

రాయబారి కృష్ణునిఁబట్టి త్రాళ్ళతోడఁ
గట్టిపడవేయ నెంచిరి కౌరవులును
నలఘు మహిమాన్వితుండౌట వలనఁ దాను
తప్పుకొనియెను ! అలరాజు తప్పుకొనునె ? 29

చెక్కెర బొమ్మ యొకర్తుక
చిక్కిన పేర్యాలదేవి చెక్కిలిఁగనుచున్
చెక్కెర విలుగొని యలరా
జిక్కిడి కేతెంచుచుండెనేయని పలికెన్ !

30

పలుకు పలుకులు కోకిల పలుకులయ్యె
కదలి వీచెడి గాలి సుగంధమయ్యె
ప్రకృతి నవవసంతము తాల్చి పలుకరించె
పేరియాలావధూటి నవ్వేళలోన !

31

కలకంఠి పేర్యాల కంటికి కాటుక పెట్టి
 పువ్వులు తురిమెను పుష్పబోడి,
రవలహారముఁదాల్చె రాజీవలోచన
 కాసుల పేరూనెకంబుకంతి,
కరకంకణములూనె కమనీయ గాత్రయు
 కులుకుటందెలు తాల్చె కోమలాంగి
పట్టు పుట్టము కట్టెపావన దేహయు
 మెలసిగ్గు లొలికించె కలికిమిన్న,

ప్రాణ విభుఁడు రాక రాక నీ నాటికి
వచ్చుచుండె ప్రేమ బంధనముల
గారవింపననుచు కల్యాణి పేర్యాల
పరవశించి యిట్లు పలుకసాగె !

32

నా కనుపెల్గు, నా హృదయనాదము, నా సకలార్థసిద్ధి, నా
నాకము, నాదుసంపదయు, నాతను, మానము నాదుప్రాణమున్
నా కమనీయ రూపమును, నామది వెల్గెడి దివ్యదీపమున్
నా కల రూపుదాల్చిన యనంతుఁడు కంతుఁడు నేఁగుదెంచునో !

33

పూజించు కొందు విభుని పాదపద్మాలు
సతతము సౌభాగ్యవతిగ నుండ
ముద్దాడుకొందు నా మోహనాంగుని మోము
తమివీర హృదయ చింతలునుతీర,
వికసింతునా రాజు బిగికౌఁగిలింతలో
నీ రస నిష్పృహల్ పారిపోవ,
వసియింతునా రాజు వక్షస్థలంబున
నుపవాస వేదనలుపశమింప,

నెన్ని జన్మలైన నిన్ను వీడనటంచు
పతిపదాలె నాకు భాగ్యమనుచు
మధురమూర్తి యపర మన్మథుఁడైన నా
ప్రాణవిభుని ప్రేమాల ప్రణుతులిడుదు. ౩౪

అని మధురోహల యందున
మునిఁగి పరవశించు తనదు ముద్దుల పుత్రిం
గని నలగాముఁడు తన య
క్కునఁ జేరిచి వార్త వినిచి, కొల్వునఁ జేరెన్ ! ౩౫

నలగామభూమీశుఁడలరి సింహాసన
మందున చిరునవ్వు చిందుచుండ,
నాగమ్మ మంత్రిణి నలుదెసల్ బరికించి
యుచిత పీఠంబున నుండునంత,
నరసింహరాజు మానసమున వింత కో
ర్కులు ననలెత్తి చిక్కులను రేపఁ
గౌరవాధిక్యము గలుగు బ్రహ్మరెడ్డి
ఘనుఁడు వీరారెడ్డికలియఁజూడ,

రాయబారిగ వచ్చిన రాచమల్లుఁ
డైన యలరాజు, కన్నమ వినయమొప్ప
నిండు నిల్వునఁ గూర్చుండి యుండునంత
కనుల పండువయౌచు నొప్పినది కొలువు !
36

పేరోలగమున జలధిగ
భీరత నెలకొనియె, నెల్లవీరులు దృష్టిన్
సారించిరి సకల కళా
పారీణుఁడు రాయబారి వంకకు నంతన్.
37

అలరాజు నిలిచి తన చూ
డ్కుల నెల్లరఁ బలుకరించి, గురజాల మహీ
తలనాథుఁగనుచుఁ బలికెను
సలలిత మధురోక్తి, రాజసము దీపింపన్ !
38

ఓ నలగామభూమిపతి ! యోకరుణైక కళాపయోనిధీ !
కానల యందు నిర్ణయ ప్రకారము బ్రహ్మనమంత్రితోడ భూ
జానియు సప్తవత్సర ప్రశాంత ప్రవాసము పూర్తిచేసియున్
మానక రాయబారిగ సమాదరణంబునఁ బంప వచ్చితిన్ !
39

సమయము తప్పకుండ మనజాలిరి కానలనిన్నినాళ్ళు మీ
సములును పౌరుషంబును, ప్రశాంతియుఁ గల్గిన వారలౌట ! నీ
సముఖమునందు నెల్లరకు సౌఖ్యము గల్గఁగ వారి రాజ్యమున్
క్రమమును తప్పకుండ నిడఁగా పలనాటికి భద్రమయ్యెడున్ !
40

అడిదము కేలఁ బూనియముఁడడ్డము వచ్చిన నిల్చి గెల్చు ధీ
ష్మ్రుఁడునగు బ్రహ్మనాయుఁడు, రిపుల్ భయమొందఁగ బోరుసల్పు ధీ
రుఁడు మలిదేవభూమిపతి, ప్రోజ్వలమౌ భుజ శౌర్యమందు ధీ
ముఁడయిన కన్నమాఖ్యుఁడును పోరున నిల్చిన గెల్పొశక్యమే !
41

పేరున బాలచంద్రుఁడయి, భీకర సంగర రంగమందు నం
బోరన ఘంట ఖానుఁడయి భూతలమెల్లను మార్చివేయు న
వీరుఁడు ! యుద్ధమెవ్వరికిఁ బ్రీతి యొనర్పదు, వారి రాజ్యమున్
వారలకిచ్చి వేయుటె శుభంబగునో నలగామభూపతీ ! 42

అనిలో నెల్లరు కూలిపోవుటయె సత్యంబద్ది యట్లుంచి తం
డ్రిని పుత్రుండును, పుత్రునిన్ జనకుఁడు న్నిర్జింపఁగాఁజూచు పో
రును వారింప సమర్థుఁడీవ ! సెలయేరుల్ పోలె రక్తంబు పా
రిన సంక్షేమమె పల్లెనాడునకు నుర్వీనాథ యోజింపుమా ! 43

అనలము శుష్కమైన విపులాటవిపై పచరించి కాల్చు భం
గిని గుర్రజాల సైన్యముల కేకలు వేయుచు పారిపోవఁ జే
సిన క్షణమందు సెంతగను చింతిలినన్ ఫలముండఁబోదు. కా
వున మలిరాజ్యమున్ తిరిగి మోదము మీరఁగనప్పగింపుమా ! 44

దరియుం దాపులేనిదా జలధి మధ్యంబందు జన్మించు భీ
కరమా మంటల నార్పివేయుటకు దీక్షంబూను వాయుందు రే
దరహాసంబున, శాంతి చిత్తమున బోధల్ సేయు బ్రహ్మన్నయే
కరవాలంబునుబూన సిద్ధరణి నొక్కండుజ్జయి నిల్చునే ? 45

శ్రీరంజిల్లఁగ సస్య సంపదలతో చెన్నారు పల్నాడు ఘో
రారణ్యంబగు ! నెత్తుటేరులయి హేయంబౌను చంద్రాపగా
నీరంబంతయు, నెందుఁజూచినను బొందిన్వీడి నర్తించి హా
హారావంబులు సల్పు నస్త్రములే న్యాయంబు బోధించెడిన్ ! 46

అట్టి విపత్తునందు ప్రజలందరు కొంపల మంది కంట నీ
రెట్టిన క్షేమమౌనె పృథివీపతి ? యెంకరి నల్లబూసలున్
మట్టెలు నేలరాలనది మంగళమౌనె ? చిరాయువున్నతిన్
పట్టెఁడు కూటికై పృథివిపాలొనరించుట ధర్మమౌనటే ? 47

పలనాటన్ సౌఖ్యశ్రీ
విలసిల్లుట కొఱకు సద్వివేకంబున వా
రల రాజ్యమెల్ల వేగమ
మలిదేవున కీయనద్ది మంగళమగుతన్ !

48

అని యలరాజు పల్కవినియందరు సంతస మొందినారు ! చ
క్కని యుపదేశమిచ్చె వినఁగావలెనంచును రాజుగారి మో
మున తమ దృష్టినిల్పి రణమున్ బలనాదున నాపుచుంచుఁ జె
ప్పినగతిఁ జూచుచుండి రొగి వీరులు పెద్దలు నొక్కపెట్టునన్ !

49

అంతగాగమ్మ వదనంబునందు వింత
నవ్వు మొలవఁగనామె భూనాథుఁగనుచు
నిలిచి గంభీరముగ నిట్లు పలుకసాగె
నవని నాథుని బదులు తానడెడి రీతి

50

అలరాజా ! యెటువంటి మాటలివి ? నీవన్నట్లు శౌర్యంబు వా
రలకున్ననిన్ను బాపికొందురకొ ? సంగ్రామంబునం గెల్చి వా
రల రాజ్యంబును బొందలేరకొ ? మహాశస్త్రాలలో నుంట, భీ
తిలి పంపించిరి నిన్ను మాకెసకు బల్ దీనత్వమున్ బొందుమన్ !

51

అదియునుగాక వారలె మహామహులంచును వందివోలె ని
ప్పదునుకునున్న కొల్వున సవాలుగఁ బల్కిన జంకుకల్గునే
ముదమున బ్రహ్మనాయునకుఁ బూజలు నీవొనరింపవచ్చు, నె
మ్మదిగల యట్టి మేము నవమానపు కూఁతలు లెక్కసేతుమే ?

52

శాంతి శాంతి యటంచు చక్కని పలనాడు
చీల్చివైచిన రణశీలియతఁడు,
వీర వైష్ణవమంచు వీర శైవులనెల్ల
బాధపెట్టిన మతవాది యతఁడు,

కోడిపోరునకు సంకోచంబు లేకుండ
రాజ్యంబు నిడిన దుర్మతి యతండు,
సంగరంబున గెల్వ శక్తిచాలక రాయ
బారమంపినయట్టి బీరుండతండు,

అట్టి బ్రహ్మనాయునకు రాజ్యంబు మరల
నొసంగు మాటలునికపైని పొసగబోవు
పెద్దగా నీవు చెప్పిన వినుటకొరకు
మేము పిన్నలమయ్యెదమే జగాన ?

53

అనవిని కన్నమ రోషా
రుణలోచనుండగుచు, నెత్తురులు కోరెడి నీ
వును నాడుదానవే ? యిదే
కనుమామగ తనమటంచు కత్తిని దూసెన్ !

54

అంత నలరాజు కన్నమనాపి యచల
యుగుచు నిలిచిన మంత్రిణి నరసి యిట్లు
పలికె కోపాగ్నిఁ గురియు దృక్కులను మిగుల
క్రుద్ధ కంఠంబుతో నెల్లరును వినంగ !

55

వీర శైవులుకాని వారలనెల్ల చం
పను బంధిపోటు నంపినదినీవ,
పాలుపొంగుచునున్న పలనాటిసీమను
భాగాలుచేసిన పడంతివీవ,
అక్రమ మార్గాల ననుసరించుచు కోడి
పోరున గెలిచిన పొలతివీవ,
వనవాసముననున్న వారల యావుల
చంపించి, మనియెడి— చపటవీవ

మారివగుచు నిలిచి మా పలనాటిలో
చిచ్చువెట్టినట్టి చెనటివీవ
అపర చెన్నకేశవా కృతి పిలిఁగెడు
బ్రహ్మనాయుఁడూర బ్రదుకఁగలదె ? 56

కసరి బుసకొట్టు నీదగు గాలిసోకి
నల్లబడిపోయె రాజు మానసము ! నేఁడు
పల్లెనాడున నయ్యెది ప్రాఁకి యెంద
రెందరిని మట్టువెట్టునో యెవ్వఁడెఱుఁగు ! 57

మామ ! నలగామ ! రణమున మ్రందుటయన
నీకు సంతోష మొదవు చుండిననికేమి
చెప్పఁగలవాఁడ ? నాయువు చెల్లిపోవు
వారలకు మందులే రీతిఁ బనికివచ్చు ? 58

అనవిని నరసింహుఁడు— చె
ప్పినయది మంత్రిణియెకాదె ? వినబడలేదే
రణమందు వారి రాజ్యం
బును గెల్చుకొనంగఁజెప్పఁ బొమ్మని పల్కెన్ ! 59

రాచమల్లుని కోపంబు రగులుకొనియె
వీరకన్నమ గైకొనె విచ్చుకత్తి
పోతరాజు కన్నమపైని బుసలుగ్రక్కె
కొలువు కూటమంతట రణ కూటమయ్యె ! 60

వీరారెడ్డి రయంబున
వీరుల పైదోలఁగఁజేసి, వినదగు రాజా
నీ రాచమల్లు పలుకులు
పోరున నష్టంబెకాదె పొందునదనియెన్ ! 61

నలగామ భూమిపతి భీ
తిలి వీరుల మందలించి, తెల్పుదు మామా
టల నెల్లి యనియె, నంతట
నలరాజును, కన్నమయు ప్రయాణము కాఁగన్ ! 62

కనులనీర్నించి యలరాజుఁ గనుచు హీన
స్వరముతోఁ బల్కె రాజు మందిరము జేర
నెల్లి వచ్చెదమని పల్కి యేఁగిరి యల
రాజు, కన్నమదాసుండు రయముమీర ! 63

తనసతి నెమ్మోము మనమున చిరునవ్వు
  పువ్వులు కుప్పలు పోయుచుండ,
జవరాలి కన్నుల జంట తేజము ముందు
  నడయాడుచును తోరణములుకట్ట,
కులసతి పాదాల కుల్కుటందెల మ్రోఁతఁ
  వెల్లగుండియలు ప్రతిధ్వనింప,
పల్లవాధర తీపి పల్కులు వినఁగోరి
  కర్ణపుటంబులు కలువరింప
నెట్టకేలకు నలరాజు పట్టుబట్టి
పోయె ముందుకు కారెమపుడినిఁ జేర
జరుగఁబోయెడి కార్యంబు తెలిసియున్న
మానవులు దైవసములౌచు మనఁగలేరె ! 64



# ఆత్మాహుతి

అంధకారానఁ జేసిన హత్యలెల్ల
వెలుఁగు కిరణాలు ప్రసరించి వెలికిఁదీసి
సర్వ జగతికి గొంతెత్తి చాటురీతి
బాల భాస్కరుఁడుదయాద్రిపై వెలింగె !

1

ఆ చీకఁటికి భారమగుచు రోదించిన
        హత్యల కన్నీరు లద్దుకొనుచు,
ఆనిశా మధ్యంబు నదరి ఘోషించిన
        పాతకంబున గుండె బ్రద్దలగుచు
ఆ నడిరేయిబల్ దీనమై చూపిన
        రుధిర ధారలఁగని రుద్రుఁడగుచు,
ఆ యంధకారంబెయ న్యాయమని చెప్ప
        దారుణ వార్తకు తల్లడిలుచు,

చెమ్మటలు చిందు దేహాన, చెదరిపోయి
పిచ్చి పిచ్చిగఁ జూచెడి వీక్షణాన
వీర కన్నమదాసుండు వెక్కి వెక్కి
యేడ్వసాగెను పేర్యాల కెదుట నిలిచి !

2

మగసిరి గల్గిన వీరుఁడు
దిగులున పసిపిల్లవాని రీతిన నేడ్వం
దగునన్న ? బావయేటికి
నగుపడఁడేమనుచుఁ బల్కెనామెయనంతన్ !

3

ఎలుఁగు రాసిన కంఠాన నిట్టులనియె
వీరకన్నమ; నలగామ విభుఁడు, నార
సింహుఁడును నాగమాంబయు చేర, వీర
యోధులెల్లను నటఁగూడి యుండునంత 4

ఏమని చెప్పుదు చెల్లీ!
నీ మగనిం జంపినారు నీచాత్ములు! నే
నీ మాటఁజెప్పి బ్రదుకఁగ
నీ మహిఁగలిగించె నన్ను నీశ్వరుఁడమ్మా! 5

మణిభూషణముల కెందును చింతసేయని
రతనాలగుణముల రమణివీవు!
పట్టుపుట్టములు కావలెనంచుఁ బలుకని
పతిభక్తి కలిగిన పడఁతివీవు!
హేయమౌ సౌందర్యమేదియు కోరని
పసుపు కుంకమలున్న వనితవీవు!
అమృతాన్నమేనాడు వాంఛించి యెఱుఁగక
పతి మిగిల్చిన కూడు సతివినీవు!

పూలుసిగనున్న, మెడ నల్లబూసలున్న
కడుపు పండిన, ప్రతి ప్రేమఁగనుచునున్న
నొడుదుడుకులేని సంసార మొప్పుచున్నఁ
జాలునన్న నీ మగనిని చంపిరమ్మా! 6

తాళిగట్టినవాఁడె దైవమ్ముగా నమ్మి
పతిమాట మీరని భరతనారి!
సిగలోని పూలతో నగుమోము చెదరక
భాగ్యంబు లందించు భరతనారి!

గృహమె స్వర్గముకాగ సహన దేవతవోలె
ప్రమదకులు పండించు భరతనారి !
బాధను నానంద పారవశ్యమునొక్క !
కరణిని భరియించు భరతనారి !

ఎండకన్నను వాన కన్నెఱుంగకుండ
గడిపితివి జీవితంబు నిక్కముగ తల్లి
పతి పదాంబుజములె నమ్మి భరతనారి
నీదు బ్రదుకును కన్నీట నింపిరమ్మ !

7

అన్నమాటలు మబ్బులేనట్టి పిడుగు
పాటుకాగ నా మతిసేలఁబడియెను ! నల
గాఢ భూమీశునకు నంధకారమయ్యె
జగతి ! నాగమ్మ తాపల్క నాగెరిట్లు—

8

నీచుఁడా ! యెంత పనిచేసి నిలిచినావు
బ్రహ్మనాయఁడేమని నిన్ను పంపినాఁడో
సౌమ్యుఁడగు నలరాజును చంపినావు
బసవ ! గుండెలు తీసిన బంటువీవు !

9

హీనకుల జన్ముఁడగు నీకు నింతకన్న
మంచి బుద్ధులు పుట్టునే వంచకుండ
వాంఛశాలతో నలరాజు ప్రాణములను
కోరి నీ పొట్టలోఁ బెట్టుకొన్నతులువ !

10

కట్టి, నీ ప్రాణములు తీయఁగలుగనేని
నాయురాలనే నేను ? నీయాయువిపుడె
మూడెనిదె చూడుమా యంచు బూకరించి
పోతరాజును నుసికొల్పె నీతిమాలి !

11

అంత కన్నమదాసుండు నాగ్రహించి
చేత కరవాలమును బూని- చీల్చివైతు
ముందడుగు వేయకనుచు బెబ్బులి విధాన
గర్జనముచేసి యిట్లు పల్కెంగసాన !

12

కరుణా స్వాంతలు పుష్పబోడులను వాక్యంబున్ హ్యృధాచేసి స
చ్చరితుండౌ నలరాజునిట్లు కడు నీచప్రాణులై చంపి, ట
క్కరివై కూసెదవేలనే? అడిగో! లోకంబెల్ల పాపాత్ముఁడా
నరసింహుండని చెప్పు రీతిని దురన్యాయంబుఁ గావించెఁబో !

13

ఛీ! యుగంతక! ఛీ నరసింహ హాతక !
అల్లునే చంపుకొనిన పాపాత్ముఁడీవు
చరిత మరచునే నీదుదుశ్చరితమెల్ల
కోడియై కూఁతురింక లోకులు జగాన !

14

మానవతిలేని కులముల మాట తెచ్చి
నాకు పాతకమును గట్టు నాయురాలి
మాటపై నల్లునిట్లు చంపంగ నీకు
చేతులెట్లొచ్చె నోరినృసింహాఖలుఁడ !

15

పసుపు కుంకుమలకు పచ్చని బ్రదుకును
బ్రదుకుమంచు తండ్రి పలుకుఁగాని
కన్నబిడ్డ పసుపు గంగలోఁ గలిపెడి
నిన్నుఁబోలు తండ్రి నేలఁగలఁడె ?

16

కాలకూట విషంబు నాగమ్మ మాట
కఠిన పాషాణసమము నాగమ్మ మనసు
నఖిల విలయ కారణము నాగమ్మ చేష్ట
లట్టి విషసర్పమును చేరనగునె నీకు ?

17

అల్లునే చంపి యాత్మహత్యా వినాశ
కారి వీవయినావుపో కనులుకప్పి
నిన్ను మన్నించునే యింక చెన్న కేశ
వుండు ? నరకాగ్ని నీపైనిఁ బోయఁడొక్కొ !

18

పోరికి వత్తురింకనిను పోలిన నీచుల మట్టువెట్టి సం
సారులఁగూల్చు ఘోర విషసర్పము నాగమఁబట్టి క్రూరమా
కోరలు పీకివేయుటకు, గుప్పిట వట్టగ సాధ్యమౌనె యె
వ్వారికి నిష్కృతుల్ ? ఖలుఁడ! పాప ఫలంబులె నిన్ను చంపెడిన్

19

అని గర్జించుచు తన్నమ
చనియెను ! పేర్యాలదేవి జడివానకు ని
ల్వాన నీరసమైన లతవలె
పసవిపసవి దుఃఖ జలధిఁబడి దుఃఖింపన్ !

20

నలగామ భూమిపతి క
న్నుల బాష్పములురలుచుండె నులివెచ్చఁగ ! ము
ద్దుల పుత్రివంకఁ గనుఁగొని
పలుకు పలుకరాక నిట్లు పలుకం దొడఁగెన్ !

21

అల త్రొక్కులాటయందున లేగల
కాళ్ళు విరుగునన్న ఘనులమాట
లెంత నిజము తల్లి ! యీనాడు రాజ్యాల
కొఱకు తగవునిన్ను కూల్చివేసె !

22

పలుకఁగలేను సత్యమును, పాపము కన్నులఁగట్టి నిల్చె నం
దెలుపఁగలేను, వేదనల దీనులు తాపముఁ బొందుచుండినన్
సలుపఁగలేను సాయమును నారవిహీనుఁడనైతి ! నాయుపే
క్షలు పగఁబట్టి యల్లునిటు చంపెను నేనిపుడేమి సేయుదున్ !

23

చెల్లియుండియు న్యాయంబు చేయకుండ
టనలమును చేతఁబట్టితే యనుచు నేడు
తెలిసినది తల్లి ! నా పాప ఫలితమెల్ల
నీ బ్రతుకు పంటనిట్లు కన్నీటఁగలిపె ! 24

అది దుఃఖించెడి నలగా
ముని మాటలు చెవినిఁ బడక పొగలెడి పుత్రిం
గనలేడు భూమిపతియును
మనమున క్రోధాగ్ని రేగి మండుచునుండెన్ ! 25

కాల్వలగుచుఁబారు కన్నీరు చెక్కిళ్ళ
మలినపరచి నారికలును గట్ట
పిడుగుపాటు వలన ఛేతిల్లు రీతిగా
చాల కుమిలె వీరిమాలదేవి ! 26

నీ సుఖాకారంబు నిల్చిన కనుదోయి
        పొంగెడు జలపాతములుగ మారె,
నీ పాదసేవలో నిలువెల్ల పులకించు
        తనులత పచివాడి ధరణి కొరిగె,
నీ తీపిపలుకులు నిరతంబు విను కర్ణ
        రంధ్రంబులొట్టి ఛిద్రంబులయ్యె
నీవు నేర్పినమాటనే కోరి పలికెడి
        జిహ్వకునే దిరుచింపదాయె,
నంధకారంబె జగతిని యావరించె
ధర్మదేవత పాదాలు తెగబడియెను
నీవులేని లోకాననే నిలువలేను
నిప్పులైనను నీదు సన్నిధియెచాలు ! 27

అని లేచి పరుగు పరుగున
చనియెను పేర్యాలయున్ స్మశానంబున క
ల్లనపతినిఁ గాంచుచును బో
రున నేడ్వఁగసాగె నెల్లరును రోదింపన్ ! 28

పతి దేహంబును వీడక
చితిపైఁ గూర్చుండెనామె, స్త్రీ లోకంబున్
కుతకుత యుడుకఁగ నాత్మా
హుతిఁగని, యెల్లరును నిదియహో ఘోరమనన్ 29

చుట్టు చేరినవారిని చూచి పేరి
యాల పంచమ స్వరమున ననియెనిట్లు
కనుల వెంబడి నిప్పుల చినుకులురల
కుంకుమారుణ ముఖమున క్రోధమూని— 30

పలనాటి వీరులారా !
వలవల దుఃఖించు నాదువదనముగనరే
తులలేని యీ విచారం
బులు తీర్పఁగఁజాలు పుణ్య పురుషులు లేరే ? 31

నా పసుపు కుంకుమలుగొని
యీ పసిదిని కాటియందు నిడినట్టి మహా
పాపి తల నఱకఁగల వా
రీ పలనాడు ననుగ్గరే యొకరైనన్ ? 32

ఆ కోరిక తెలుపేర్పం
జే కోశమునందు చింతయే లేదిఁక , ఏ
రాకాసులార ! చెల్లికి
నీ కానుక నొసఁగుడద్దియే పదివేలా ? 33

అని విన్నవించి పతి దే
వునితో సహగమనయగుచు పోయెను నిష్ఠల్
వినయమున స్వాగతంబిడ
ఘనమగు పలనాటి లక్ష్మి కన్నీరొలుకన్ ! 34



# బాలచంద్రుఁడు

పిండి వెన్నెల లేలేత వెల్లువీన
బాలచంద్రముఁడాకాశ పథమునందు
ప్రేమ వెన్నెల లేలేత వెల్లువీన
బాలచంద్రుఁడు మగువ మాంచాల యింట !

1

శారీరేచ్ఛలు లొంగిపోక పతికిన్ శౌర్యంబుఁ గల్పింపనై
ధీరుల్ రంజిలఁ బల్కసాగినదియా దేవేరి మాంచాలయున్
వీరుల్ గారె, యవక్ర విక్రమున న్వ్యభ్రాంతిఁ గల్గింపరే
నారీరత్నము లెన్నఁగా విజయ ఘంటల్ మ్రోఁగ గర్జింపరే !

2

పాలికలని లోన నెల్లరు
కలియఁబడుట కొఱకునేగఁగానీ విక్లే
లలనల కౌఁగిలికై చం
చలమతిపై యుంటతగునె శౌర్యంబుడుగన్ !

3

రణరంగమునఁ బోరుటన వీరవరులకు
నాటలనాడిన యట్లుకాదె,
వైరి మస్తకములఁ బడగొట్టుటయనిన
బంతులాటాడన పగిదికాదె,
శత్రు బలమును నాశన మొనరించుట
మట్టిబొమ్మల దున్మినట్టుగాదె.
రణరంగమందు మరణమన్న సూర్యాక్షీ
లలన యందించు కౌఁగిలియొకాదె

పల్లెనాటిలోనఁ బ్రభవించి శీలము
వారి యింటిలోన పాలు ద్రావి
క్షణికమైన యట్టి శారీర సౌఖ్యంబు
కొఱకు నింటనుండ గొల్లుమనరె ?

4

చేయఁగఁ బొమ్ము పోరు, పొడిసేయఁగ బొమ్మిక శత్రుసేనలన్
మాయలమారి కొక్క మటుమాయము సేయఁగఁ బొమ్ము, పొమ్ము దీ
ర్ఘాయువుఁ ద్రుంచి పైచి పెరియాలను చంపినవాని చంపఁగా
నీయసహాయశౌర్యమును నింపఁగఁ బొమ్మిక దిక్కు దిక్కునన్ !

5

అని మాంచాల వచించిన
ఘన శౌర్యముతోడ మనసు గంతులు వేయన్
"అనపోతరాజు", మిత్రులు
తన వెంబడి కదలినడువ ధైర్యముతోడన్

6

కారెమపుడి రణరంగముఁ
జేరుటకై పోవుచుండ్రి శీఘ్రంబుగను
పొంగులు, సమరోత్సాహము
మేరలు మీరంగ, ధూళిమింటికెగయఁగా !

7

బాలచంద్రుఁడంత బ్రాహ్మణోత్తము డన
పోతరాజు వాఁడుఁబోరెనేని
ప్రాణహానిఁ గలుగును బ్రహ్మహత్యా నేర
మగునటంచుఁ దలఁచి యతనిఁ బిలిచి—

8

ముద్దుటుంగరంబు ముత్యాల హారంబు
విడిచివచ్చి నాఁడ వేగనీవు
మరలి పొమ్ము నేడె మాంచాలపురికంచుఁ
బంపెనతని చిక్కఁబట్టి హ్రాదివి !

9

ఓ యనపోతరాజ ! వినవో ! యనికీవరుదెంతు వేసినా
యాయువుఁ బోసికొన్న యటులౌనిదె యొట్టును పెట్టుచుంటి దీ
ర్ఘాయువుగా మెలంగి నిజమైన సఖుండవు నీవుకాఁగ మా
శ్రేయముఁగోరి యిద్ధరణి జీవితయాత్ర యొనర్పు మిత్రమా ! 10

అనియొక లేఖ వ్రాసి "త్రిపురాంతకమం"దున నొక్క చెట్టుకొ
మ్మననిడి సాగిపోయె మతిమంతుఁడు తానన బాలచంద్రుఁడున్
పెనఁగొనునట్టి దుఃఖమున వీరుల తోరణ భూమిఁజేర, నే
మనగు ! మిత్రులెప్డు హృదయ వ్యథఁజెందుచునుందు రక్కటా ! 11

అనపోతరాజు వేగం
బున పురమునఁజేరి హారమును నుంగరమున్
గొని తిరిగివచ్చి చెట్టునఁ
గనిపెంచెడి లేఖఁజూచి కన్నీరొలుకన్ ! 12

వెఱ్ఱి బాపఁడంచు వీఁడు కాఁడంచు
విడిచినావె నన్ను పిరికిననుచు
బాలచంద్ర నీవు ప్రాణ సమాన మి
త్రుఁడవు ఒట్టు నెట్లు త్రోసివేతు ? 13

యుద్ధమందు వైరి యోధులఁబరిమార్చి
మంచి మిత్రుఁడనెడి మంచిపేరు
నిలుపుకొనఁగలేని నేనేల ? యని చింత
దూలి పోతరాజు చాల కుమిలె ! 14

వీరమేడపి నుండి వేవేగ "కారె
మపూడిఁ" జేరఁగఁబోయెడి "మాడచి"యను
పొలఁతి కనుఁగొని మాయన పోతరాజుఁ
నడిగె నెవ్వలకట్లింటి వనుచు నపుడు ! 15

తన జందెంబును బెసదం
బును మిత్రునకీయు మంచు పొలతికినిడి, బా
కున గ్రుద్దుకొనుచు మడిసెను
అన పోతాఖ్యుండు ప్రకృతి యాక్రోసింపన్ !

16

మరణముఁ బొందుచుండెదరు మానక ప్రాణులు, సర్వకాలమున్
ధరణి వసించు జీవ సముదాయములేదిది నిక్కువంబు ! భీ
కరముగ తన్నుతాన తన ఖడ్గముతో వధియించుకొంచు సు
స్థిరతను పోతరాజు కనె తీయని మిత్రఫలంబుఁ బొందుచున్ !

17

ఆ దృశ్యంబునుగని తల
బాదుకొనుచు మాడచియును పరుగున చనయెన్
ఆ దుర్వార్తను బాలుం
డాదిగ పెద్దలకుఁ దెలుపనతి దుఃఖమునన్

18

కారెమపూడిలోన నలగామని పంపున సంధి కోసమై
కోరి ప్రయత్నముల్ సలుపఁ గూర్చొని యుండిన "కేతరాజు" సం
స్కార విహీనుఁడై తనదు సైన్యము నొక్కట దాచిపెట్టి యె
వ్వారలు చూడలేదనుచుఁ బల్కుచునుండెను శాంతి పాఠముల్ !

19

మీ రాజ్యము మీకిత్తుము
కోరిన నరసింహుఁ బట్టికొని యిచ్చెదమీ
పోరును మానుఁడు వీరని
ఘోరమఁటఁడు పల్కె వినుఁడు ముదముననియెన్ !

20

పొంచిన సేనలఁగని శా
ర్వాంచితుఁడగు బాలచంద్రుఁడనె— నీచులు కా
వించిన కుట్రల లోఁబడి
వంచితులైనారు శాంతి వచనంబులచే !

21

పోరికి వీరలు జంకిన
నూరకయుండుండు నాబలోద్ధతిఁగనుచున్
వైరుల మదమడఁగించెద
క్రూరుఁడు నరసింహు శిరముఁ గొట్టెదనేడే !

22

వయసు మళ్ళినట్టి వారలు మీరాట
పౌరుషంబు చచ్చి పందలగుచు
వైరిమూఁక చేయు వంచన లెఱుఁగక
సంధియంచు కాళ్ళు సాచినారు.

23

సంధి చేసెడివారైన సైన్యములను
చాటుమాటుననిడి చర్చ సలుపఁగలరె ?
నాగదంష్ట్రి సమంబైన నాయురాలి
మాయలందు ననుచితంబు మఱచినారు !

24

అనుచునున్నంత మాడచి యరుగుదెంచి
పోతరాజు మరణవార్త పూసగ్రుచ్చి
నట్లు వినిపించి, యతడంపినట్టికాన్క
సవినయముగ నిచ్చెను బాలచంద్రునకును.

25

తన మిత్రుండన పోతరాజు తను రక్తంబిచ్చి శౌర్యాగ్ని కిం
ధనమైపోయెను ! బాలచంద్రు మదిలోనన్ రేగె తీవ్రాగ్ని ! య
త్తిన ఖడ్గంబును దింపకుండునటులే దిగ్భ్రాంతి చెందెన్ ! నిజం
బునకా మిత్రుడె పీడుఁడై దినదినంబు న్వెల్గనుర్వీస్థలిన్ !

26

బాల్య కాలమునందు నోలచేసినాడు
కన్నతండ్రిగ బోధగఱపినావు,
కోడె ప్రాయమునఁ జిక్కులలోనఁ బడిపోవ
నీతులనెన్నియో నేర్పినావు

30)

కులమన్నదేనాడు కోరక నిజమైన
మిత్రుండవీవుగా మెలఁగినావు,
సద్బ్రాహ్మణుండవయ్యు శౌర్యాన నెవ్వరు
సాటిరారని నేడు చాటినావు,

బాలచంద్రుని మిత్ర భావంబు నీవ
బాలచంద్రుని శౌర్య సంపదలునీవ
బాలచంద్రుని పంచ ప్రాణాలునీవ
బాలచంద్రు పదును కరవాలమీవ !

27

అని చింతించుచు నా సం
ధిని భగ్నము చేసి, తండ్రి దీవనఁగొని గు
ప్పున నగ్ని లేచి యెండిన
వనమున పచరించునట్లు బాలుండురికెన్ !

28

ఒకపైపు మండాని యోధులెల్లరును బ్ర
హ్మన్న సేనలకు సహాయులైరి,
ఒకవంక గుత్తికొండకు ప్రాణమైనట్టి
సేనలు మాచర్ల సేవఁగలిసె,
ఒక ప్రక్క విజయగీతికల మారాప్రుపురి
వీరులు బ్రహ్మానం జేసుకొనిరి
ఒక చెంప సమతామహోజ్జ్వల హృదయులు
బ్రహ్మనమంత్రికి బాసటయిరి

వీరకన్నమ, బాదన్న పేరినీడు
సమరకేళీ మహోత్సవాసక్తులైరి
బాలచంద్రుండు సైన్యాధిపతిగనయ్యె
నుత్సవంబున సేన పెల్లుబికెనంత !

29

చందవోల్ బలగంబు శౌర్యసంపన్నమై
నలగాము సేనలఁ గలిసికొనియె,
ధరణికోట వసించు పరివారమంతయు
నాగమ్మ భూరి సైన్యములఁగలిసె,
వేల్పునూతననున్న వీరావతంసులు
నలగామ విభుని సేనల గలిసిరి,
మిత్రరాజన్యుల మితమైన సేనల
తోడ నాగమ్మకు తోడుపడిరి.

నాయురాలి సైన్యములను నాయకుండు
రిపులఁదునుమాడు మాడ్గులరెడ్డియాయె
నారసింహుఁడు, నలగామ వీరులెల్ల
సమర సన్నద్ధులైరి దీక్షను వహించి ! 30

"చెన్న కేశవా" యనియె బ్రహ్మన్న సేన
"హరహరా" యనిసాగె నాగమ్మ సేన
పోరు సాగెను ! కారెమపూడి యుద్ధ
క్షేత్రమొప్పెనుపో కురుక్షేత్రమనఁగ ! 31

బాలచంద్రుని శౌర్యాగ్ని కీలలందు
మిడుతలుగ మారె నాగమ్మ మేటిసేన
బాలుఁడేవీఁడు ? ప్రాణులఁబట్టి చంపు
కాలుఁడేయని వీర సంఘములు పొగడ ! 32

అలుగులు వేసినట్లగుపింపనేలేదు
పక్షులై రాలెను వైరిసేన !
కత్తిఁదిప్పిన యట్లు కనిపింపనేలేదు
తలలు బంతుల వోలె ధరణిరాలె !

బల్లెంబు విసరిన పోఁదిఁ గన్పట్టదు
గుఱ్ఱపు రౌతులు కూలిపడిరి !
విచ్చుకత్తినిఁగప్పు విప్పినట్లేలేదు
పగవారి రొమ్ములు వ్రయ్యలయ్యె !

యుద్ధరంగమందు యోధులకెల్లను
బాలచంద్రుఁడెదురు పడుచుఁబోర
తుప్పగూలిపోయె గురజాల సైన్యంబు
బాలచంద్రుధాటి తాళలేక !

33

కరవాలంబునుగొని భీ
కరముగ నర్తించి వైరి కరచరణంబుల్
శిరములు ఖండింపఁగ న
త్తఱి నరసింహుండు చూచి తాఁకెను బాలున్ !

34

బాలచంద్రుఁడు నరుణ నేత్రాలతోడ
వానిఁగనుఁగొని యీ రీతిఁ బలుకసాగె
హైహయాన్వయ గౌరవం బధముఁడైన
నీ వలన నేలపాలయ్యె నేఁడు నీచ !

35

రాచమల్లు నర్ధరాత్రంబులో హత్య
చేసినట్టి చెనటి సిగ్గులేదె ?
నీదు శిరమునిపుడె నేలరాలఁగఁజేతు
ధైర్యమున్న నిలువు ధర్మహీన !

36

అన్న, నరసింహుఁడతనికి ననియెనిట్లు
సంగరంబన్న సబ్బాయి సరసమౌనె ?
బొంగరాలు త్రిప్పుటలోనఁ బ్రొద్దుపుచ్చు
శిశువు నరసింహుతోఁ బోరు సేయఁగలఁడె ?

37

వీరుఁడవగుచో నాతోఁ
బోరుము, కాదేని చనుము, పోకిరి కూఁతల్
బీరువులు కూయుదువు, నీ
వారయ వీరుండ వగుదువా వాచాలా ?

38

కరవాలంబులుగొని సు
స్థిరులై పోరాడుచుండ్రి తీవ్రంబుగనా
నరసింహ బాలచంద్రులు
పరికించెడి వారి గుండె బ్రద్దలుకాఁగన్ !

39

విదలింప నుఱుకు సింగపు
కొదమయగుచు బాలుఁడురికె కోపంబున, న
మ్మద గజము నారసింహుని
విదలించి శిరంబు నఱికివేసెన్ దీక్షన్ ?

40

నఱికిన నరసింహుని తల
కరమందునఁబూని శౌర్య గంభీరుఁడుగా
నరిగెను బాలుఁడు తండ్రికి
నరవరునకుఁజూప సింహానాదముతోడన్ !

41

సంజకెంజాయలో వెల్గు చంద్రుఁడట్లు
బాలచంద్రుఁడు రక్తనదాలలోన
మునిఁగి యరుణాత్మై కనుపట్టు తనువుతోడ
మస్తకముఁగొని చేరె బ్రహ్మన్న దెసకు !

42

బాలునిఁగాంచి యుగ్రుఁడయి, పల్కెను బ్రహ్మన- శ్రేష్ఠుఁడన్న భూ
పాల కుమార రత్నమగువాని శిరంబును గొట్టచేతులే
లీలగ వచ్చెనీకు ? రిపులే? మనవారలు కారెవారు ? మా
పాలిట శత్రువైతివె! ఎవండిటుఁ బిల్చెను నిన్ను పోరికిన్ ?

43

మదమున నుత్తమాంగమును మంటికి దింపిన మందబుద్ధి ! నీ
వదనముఁజూడ ప్రాప్తమగు పంచ విధంబుల పాతకంబులున్
కదన విజేతనంచునిట గంతులు వేయఁగ వచ్చినావె ? ఛీ
కదులుము, నీదు మోమునిఁకఁ గన్పడనీయకు వంశనాయకా !

44

బ్రహ్మనాయు పల్కు బాలచంద్రుని గుండె
గాయమగుచు రేగగానతండు
నారసింహు శిరము నావలఁబడవైచి
పలుకసాగె రోష భాషణముల.

45

నాగమ్మ మాయలింత యుగ్రాహ్యములుగాక
పలనాడు చీల్చిన పాపివీవ !
కోడిపోరని నంతకోడివై పగవెత్తి
మలిరాజ్యమొడ్డిన ఖలుఁడ వీవ !
రాయబారమటంచు రాచమల్లునిఁ బంపి
చంపించినట్టి దుశ్చరితుఁడీవ !
వైరులఁ బొగడుచు, వీరుల మగుమమ్ముఁ
దూలనాడిన యట్టి తులువవీవ !

శాంతి శాంతియంచు జవసత్త్వములు సచ్చి
పలువరించు ముసలివగ్గ వీవ
మమ్ము నిందసేయు మగఁటిమి గల్గిన
వారి కీర్తి మచ్చపడునె జగతి ?

46

తండ్రివీవుగావు తనయుఁడనేఁగాను
ఎట్టి బంధములును నిఁకనులేవు
యుద్ధరంగమందు నూఁచకోఁతలు కోసి
వీరమూర్తిననుచు వెలుఁగఁగలను !

47

అని యనికిఁ బరువులెత్తెడి
తనయుని బ్రహ్మాన్నకనుచు తపబడుచును చె
న్నానిఁ దలఁచి, జరుగు ఘోరం
బును మనమున నెంచుకొంచు పొగులుచునుండెన్ !
48

హోరాహోరిగఁ బోరసాగె తనలో నుత్సాహముప్పొంగ నా
కారెంపూడి రణాంతరాన నిరుపమాల్ ప్రస్తుతింపంగ న
వ్వీరాగ్రేసరుఁడైన బాలుఁడపు డవ్వీరాభిమన్యుండునై
పారంద్రోలెను వైరిమూఁకలను గోపాలుండు నాలంబలెన్ !
49

వెన్నుపోటు పొడిచె వీర మర్యాదను
సమయఁజేసి బాలచంద్రు నొకఁడు
ప్రక్కటెముక చీల్చివయ్యలు కాఁగ బ
దాబదలుగ పొట్ట పగిలిపోవ !
50

బయటఁ బడవచ్చు ప్రేవులఁబట్టి నిలిపి
దట్టి బిగియించి రక్తపుధారలందు
తడిసిపోవుచు, వదనంబు తుడుచుకొనుచు
సమరమును సల్పెనా బాలచంద్రుఁడెలమి !
51

పటుతరంబుగఁ బోరి బాలచంద్రుండు
ఎటుఁజూచినను పీన్గులే కనిపింప
కరవాలపాణియై కదలె ముందునకు
నరివీరులకు గుండెలదరి పారంగ !
52

చెలరేగి వైరులఁజీల్చి చెండాడి
బలమెల్ల క్షీణించి బ్రహ్మాన్న సుతుఁడు
జలజల రక్తంబు జాలువారంగ
పోలికల నంతయు ముంచె రక్తమున !
53

దిక్కుతోఁచక భానుండు దిగెను వచ్చి
మాంబునిధిలోన నరుణ దేహంబుతోడ
పిడుచకట్టెను నాలుక తడుపు కొఱకుఁ
జేరె బాలచంద్రుఁడు "గంగధారి మడుగు". 54

శక్తి క్షీణించినది బాలచంద్రు తనువు
నందు! ముసుగులోనిది రక్తమగుటఁ జూచి
పెదవి విరుచుచు దట్టిని విప్పినంత
కడుపులోని ప్రేవులు తన కాళ్ళఁబడియె! 55

"చెన్న కేశవా" యనిపడి కన్నుమూసె
బాలచంద్రుఁడు తనదు బాణాలపైని
సమరమును సల్పుచున్న మాంచాలసతియు
పరుగునను వచ్చి పతిపైని వాలిపోవ! 56

పల్లెనాటి ప్రజల పౌరుష కీర్తులు
బాలచంద్రునందు ప్రతిఫలించె
భరతదేశచరిత బంగారు పుటలలో
నిత్య నూతనముగ నిలుచునతఁడు! 57



# పరిత్యాగము

బాలుని మరణోదంతము
చీలిచె బ్రహ్మన్న గుండె చిత్రంబుగ ! స
చ్ఛీలుఁడు కొమ్మన రణమున
కాలుఁడుగా నిలిచి శత్రుగణములఁ దాఁకెను !

1

తన శస్త్రాస్త్ర పరంపరల్ గురిసి ఖేదం బొంది పర్యాప్తుఁ జే
సెను ధీరుండగు కొమ్మరాజు రిపులన్ ! చింతించు సైన్యంబునం
తను నాగమ్మ సమీకరించి— యిదియేనా మీ ప్రతాపంబు ? కొ
మ్మనను జంపుఁడటంచు నారచెను దుర్మంత్ర ప్రబోధంబులన్ !

2

వృద్ధ సింహంబు మూడిక్క—నవ్వీరవరుఁడు
పోదివి గురజాలసేనల మదమడంచె
వాని ఘాతకు కలగుండువడినయట్లు
తొలఁగె రిపుసేన లేడి గుంపుల విధాన !

3

అలసి కొమ్మన్న తనదు దివ్యాస్త్రములను
బ్రహ్మనకుఁ బంపి, నాగమ్మ బలగములను
చంపుఁడని కోరె తనను నిశ్చలుఁడునగుచు
చవటలై వారు బాణవర్షమ్ముఁ గురియ !

4

కొమ్మన మడిసెను రణరం
గమ్మునయని విన్నయంత కంగారున సాం
తమ్ముగఁ గూలెను జనపతి
కిమ్మహీ గాఢాంధకారమే యగుపింపన్ !



5

మలివిభుఁడు బ్రహ్మనాయునిఁ
దిలకించుచు నాయువింకఁ దీరెను నాకున్
పలనాడు నిత్యశాంతికి
నిలయంబుగఁ జేయుమంచు నేలకు నొరిగెన్ ! 6

కనుఁగొల్కులందు నులివె
చ్చని బాష్పములు రాలుచుండ సచివుండగు బ్ర
హ్మన మిగుల కుమిలిపోయెను
తన మూలంబుననె జరిగె దారుణమంచున్ ! 7

అనుఁగు శిష్యుండగు నలరాజు నటకంపి
ప్రాణాలు తీసిన పాపి నేను !
అలుఁగు భూవిభుని బిడ్డలలోన నిరువుర
రణమందు సమయఁ జేసినది నేను !
అరివీరులకు భయంకరుఁడౌచు దీపించు
బాలునిఁ జంపిన వాఁడ నేను !
కూరిమిమామయౌ కొమ్మరాజును యుద్ధ
భూమిఁ జంపినయట్టి భూతమ్మేను !

శాంతి శాంతి యటంచునే చంపినాను
పావనాత్ముల, చుట్టాల బంధుజనుల
నిందరిని చంపితింక నే నేమిచేతు
వల్లకాడుగా మారిన పల్లెనాడు 8

ఇంకే విషాదవార్త కొఱకే యుఱనిల్చితి ! రక్తధారచే
పంకిలమయ్యె భూమి, బలవంతుల నెల్లరఁ గూలఁజేసి శౌ
ర్యాంకితుఁడైన పుత్రుని దురాత్ముఁడ నేనయి కూలనాడితిన్
శంకలు నేలనిప్పుడు స్మశానము నన్నిదురింప నెల్లరున్ ? 9

నాగమ్మా నిను నమ్మినందులకి దేనా ప్రాప్తమయ్యెన్ మహా
భాగుండే నలగామ భూమిపతికిన్ ? బంధు స్నేహాసక్తుడై
యేగమ్యంబును జేరలేడతడు, నీవే కారణంబౌచు మి
న్నాగుం బోలుచు శాత్రుపై చిత్రవి పల్నాటిన్ విషప్రాణివై !

10

నిన్ననవేల ? నేనె యవనీ తలమందున వ్యర్థజీవినై
కన్నను మిన్నుగానక ప్రగల్భములాడితి నల్లపోరులో
నన్నియు గోలుపోయితినహా ! యిపుడొంటరినైతి నేడు నీ
పన్నిన యుచ్చులందు విధివంచితుడై నొక బంధితుండనై !

11

బ్రహ్మనాయడి విధమున పగచుదుండ
రక్తసిక్తుడై యతిభీకరముగ నిల్చి
వీరకన్నమదాసు విన్పించెనంత
బవరమున నిల్చి "పచకుల బ్రహ్మ" యనుచు.

12

ప్రాణికోటికి నెల్ల ప్రాణ ప్రదంబైన
ఛండభానుడు మింట మాడినట్లు.
ఆయువు నందించునవిల ము ఘోరమై
వేగాన భూమిపై సాగినట్లు,
నదులను వెచ్చని పొదిగిటిలో దాచు
సాగరం బలలను సాచినట్లు,
అనలంబు గుప్పు గుప్పున లేచి తీవ్రమై
యెండుటడవిని దహించినట్లు,

కన్నుదోయి నిప్పుకణములు గురియంగ
భృకుటి నాట్యమాడ భీకరుడుగ
నాయుధంబుగూని "హా చెన్న కేశవా"
యనుచు బ్రహ్మనాయుడరిగెననికి !

13

మృగరాజునుఁగని మృక్కడి
మృగములు పరువెత్తునట్లు మ్లేచ్ఛకళాపా
రఁగులెల్లఁ బారిపోయిరి
యగణిత శౌర్యుండు బ్రహ్మనాయ్యని గనుచున్ !

14

ఒకవ్రేటున పచకుల బ్ర
హ్మకు బ్రహ్మన స్వర్గవాసమమరిచి, కోపా
గ్నికి బలిచేసెను వైరులఁ
బ్రకటిత దుర్వార బాహుబల విక్రముఁడై !

15

నాయురాలు తాఁకెను బ్రహ్మనాయు నెలమి
యబలతో యుద్ధ మొనరింపననుచు, నామె
గుఱ్ఱములఁ జంపి రథమును కూల్చివైచి
తరిమె బ్రహ్మన్న యామెనుదారుఁడగుచు !

16

నలగామరాజు భయ వి
హ్వలుఁడై చనె "కొందమగొండ్ల" పఱకాతని నె
ట్టులనైన కావ్రుఁడని యం
జలి చేసిరి ప్రజలు, విశిచె సచివుండతనిన్ !

17

ఎటుఁజూచిన మస్తకములె
యెటుఁజూచిన త్రెగిన కరములే ! చరణములే
యెటుఁజూచిన మొండెములే
యెటుఁజూచిన రక్తవాహినీ యరుణిమలే !

18

ఒక కంట చంద్రవంకయు
నొకకంటను నాగులేనుసురలంగ వికా
వికలైన మానసంబున
నకలుషిత మతియగు బ్రహ్మనాయ్యఁడు వగచెన్ !

19

ఓడి గెలిచినావహో నాగమాంబ నీ
తెలివి తేటలెల్ల తెల్లమయ్యె
పురుషుఁడీవెయైన భూచక్రమంతయు
పాలనంబుసేయు ప్రతిభనీది !

20

జీవిత చదరంగంబున
పావుల మిశ్వారము ! మనదు భాగము ముగిసెన్
జీవితమునందు శాంతికి
జీవంబిడలేక రణముచేసితి నిటులన్!

21

దేశస్థులకు పరదేవతగా నిల్చి
యన్నంబుఁబెట్టిన కన్నతల్లి !
అతిథులకెల్ల యభ్యాగతులకు నెల్ల
కల్పవల్లిగనున్న కన్నతల్లి !
శాంత్యహింసలకును సత్య ధర్మములకు
కాణాచియైనట్టి కన్నతల్లి !
ఘనులకు మరి త్యాగధనులకు నిల్లుగా
కలకలలాడెడు కన్నతల్లి !

పాడిపంటల పుట్టిల్లు ! భాగ్యములకు
పట్టుఁగొమ్మయు, కన్నుల పండువగుచు
నందనంబుగనున్న పల్నాడు నేడు
రుధిర ధారలఁ దడిసి యరుణముఁదాల్చె

22

పల్లెనాటిలోనఁ బరిపూర్ణమగు శాంతి
కళలు వెల్గుగాక ! కనులపండు
వగుచు సస్య లక్ష్మి శ్యామలంబగుగాక !
ఘన శుభంబులెప్డు కలుగుగాక !

23)

23

అనుచు నాయుధంబు నావల బడ్వైచి
సాగిపోవుచున్న సచివుఁగనుచు
కనుల నీరునించి కన్నమదాసుండు
నట్లై నిలిచియుండెనచలుఁడగుచు ! 24

—శుభము—



# తప్పొప్పులు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 15 | 4 | వినితింతు | వినుతింతు |
| 16 | 6 | క్షణపే | క్షణమే |
| 18 | 24 | అరయలేము | అరయులేము |
| 30 | 5 | సోముసోదరులు | సోమసోదరులు |
| 38 | 15 | బ్రహ్మన | బ్రహ్మన్న |
| 47 | 6 | పక్కలను | ప్రక్కలను |
| 57 | 1 | క్రీడికు | క్రీడకు |
| 85 | 2 | నాబలొద్ధతి | నాబలోద్ధతి |
| 87 | 9 | సైన్యములను | సైన్యములకు |
| 88 | 2 | కూలిపడిరు | కూలిపడిరి |
| 95 | 15 | ననిలబు | ననిలంబు |